# భారతి ముప్పది ఆరవ సంపుటము

## అకారాది విషయసూచిక

# విభీషణశరణాగతి: రాముని రాజనీతి

శ్రీ ఆదిభట్ల వేంకటరమణ

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే,
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ"

ఇది శ్రీ రామచంద్రుని వచనము. ఒక్కమారు శరణాగతుడై, నేను నీ వాడను, రక్షింపుమని యెవ్వడు కోరునో వానికి జీవులవలని భయమున్నను తీర్చి కాచి రక్షింతునని శ్రీరాముడు చెప్పియున్నాడు. శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణత్వమే రాఘవుల వంశానుగతమైన ఆచారము. అందు శ్రీరాముని శరణాగత వాత్సల్యము పరాకాష్ఠ నొందినది. శరణన్న వారి నాదరించి రక్షించుటలో రాముడు తక్కిన రాజుల కాదర్శప్రాయుడు. ఆ కరుణామయుని దివ్యచరిత్రలో శరణాగత రక్షణమందలి అకుంఠిత దీక్షయే రావణుని బోధింపబోయి, అవమానితుడైన విభీషణునిపాలి, లంకాధిపతిని గావించినది.

రావణుని చిన్నతమ్ముడు విభీషణుడు ధర్మాత్ముడు; ఇంగితజ్ఞుడు; దైవభక్తి, పాపచింతకలవాడు. రాముని పరాక్రమాదులను వినుచున్నాడు. శ్రీ రాముని ప్రయత్నములు దుష్టశిక్షణ, శిష్ట రక్షణలయందు లక్షితములగుటచే తెలిసినవాడైనాడు. శ్రీరాముడు కపిసేనతో లంకపై రానుండెను. రావణుడు కొలువుచేసి, మంత్రి సేనానులతో బలాబలములను చర్చి యోచింప మొదలిడినాడు. సుమంత్రాదులు తన పెంపుల కొలగుల చెరుగక యుద్ధమే కర్తవ్యమనుచుండిరి.

అప్పుడచ్చటికి పరమ భాగవతోత్తముడు బుద్ధిశాలి, రాముని చరణారవిందముల సేవించువాడగు విభీషణుడువచ్చి రావణునకు కైమోడ్చి యూర్చినాడు.

"తత్రాగతో భాగవత ప్రధానః
విభీషణో బుద్ధిమతాం వరిష్ఠః,
శ్రీరామ పాదద్వయ ఏకతానః
ప్రణమ్య దేవారి ముపోపవిష్టః"

రావణుని కొలువులో నిచ్చకములాడు వారెక్కువయిరి. వారు రాముని నిందించుచు యుద్ధమునకు రావణుని పురికొలుపుచుండిరి. విభీషణుని కామాటలు రుచింపలేదు. "ఓరాజా! నిన్ను సీతయను పెద్ద పిశాచము పట్టినది. దానినుండి నీవు విముక్తి నొందలేవు. ఆమెను పూజించి రామున కొసఁగు"మని యెన్నో విధముల నుపదేశించినాడు. శుభకరమై మేలయినది ధర్మమగుటచే పరిశుద్ధమైన వాక్యమును చావబోవువాడు ఔషధమువలె రావణుడు గ్రహింపలేదు.

"శుభం హితం పవిత్రంచ విభీషణ వచః ఖలః,
ప్రతిజగ్రాహ నైవాసౌ మ్రియమాణ ఇవౌషధమ్"

పై విషయమంతయు నధ్యాత్మరామాయణము లోనిది. ఇక్కడ శ్రీమద్రామాయణములో రావణునకు హితముపదేశించి విభీషణుడెన్నో నైతిక ధర్మములను వ్యాఖ్యములను చక్కగా వివరించినాడు సభలో రావణుడు తన మాటలు వినకపోగా రావణుని మందిరమున కేగి "ప్రదీయతాం దాశరథాయ మైథిలీం" అని ముక్తకంఠముతో పదేపదే చెప్పినాడు. రావణుడామాటలను చెవినిడలేదు. మరునాడు సభలో విభీషణుడు ప్రహస్తాదుల యుద్ధోన్మాదమును ఖండించి, మేఘనాదుని మందలించి నిశ్చయముగా రానున్న ఆపదను రావణునకు హెచ్చరించినాడు. తమ్ముని తలపైతన్ని తనయొద్ద నుండి పొమ్మని రావణుడాజ్ఞాపించగా ప్రహస్తాదులా చర్యను బలపరచిరి. ఆ యభిమానవంతుడిక అన్నయొద్ద నెట్లుండగలడు? లంకలో వాని మనుగడ సాగునా? లేకున్న వానికి దిక్కేమి? సర్వలోకములకు శరణ్యుడగు రాము నాశ్రయించుటకన్న నింకేమి చేయగలడు. వెంటనే తన నలువురు మంత్రులతో సాగరముదాటి రామునిసేన విడిసినచోట ఆకసమునుండియే సుగ్రీవాదులకు వినిపించునట్లు,

"సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే,
నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్."

అని విన్నవించినాడు, అది విని సుగ్రీవుడు రాముని దరిచేరి "రావణుని తమ్ముడు విభీషణుడను వాడట, మిమ్ము శరణుకోరి వచ్చినవాడట. ఇదేదో

# విషయానుక్రమణిక

## జనవరి 1959



1122/4

## ఫిబ్రవరి సంచికలో

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్



జనవరి 1959

సంపుటము 36 : : సంచిక 1

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జనవరి 1959





1122/4

## ఫిబ్రవరి సంచికలో

# భారతీ జన్మదివసము

గత 35 సంవత్సరాలనించీ అవిరత సాహిత్యారాధన సాగిస్తున్న భారతి నేటితో 36 వ సంవత్సరంలో ప్రవేశిస్తున్నది.

ఈ జన్మదినోత్సవ సమయంలో ఆంధ్ర దేశ సారస్వత సర్వతోముఖాభివృద్ధికి నిశ్చలోత్సాహం చేసి భారతి వ్యవస్థాపకులై ప్రాతః స్మరణీయులయిన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరాయని పుణ్య సంస్మృతితో పులకితులమై వారి వాఙ్మయ మహాదర్శాలోకమారు మనసారా సంస్మరించి సభక్తికంగా వినీతాంజలి ఘటిస్తున్నాము.

మా కెన్నెన్నో విధాల తోడ్పడిన పాఠకులకు, కవీశ్వరులకు, కథకులకు, నాటక రచయితలకు, వ్యాసకర్తలకు ఈ శుభ సమయంలో అభినందనా లందిస్తున్నాము. భారతి తోబుట్టువు ఆంధ్ర సచిత్ర వార పత్రిక స్వర్ణోత్సవం ఇదే తరుణంలో కలిసి రావడం మాకే కాక పాఠకులందరికీ హర్ష దాయకం కాగలదని ఆశిస్తున్నాము.

మా పత్రిక గడిచిన 35 సంవత్సరాల నించీ సాహిత్య సంప్రదాయాలు సంరక్షిస్తూ నవీన కల్పనలకు, నూతనాభిరుచులకు శాయశక్తులా దోహదం కలిగిస్తున్నది. తెలుగునాట ఈనాడు పేరు మిగిలిన సాహితీ పరులందరు ఒకనాడు భారతీ ప్రసిద్ధులే అనీ, ఈమాట అతిశయోక్తి కాజాలదనీ భావిస్తున్నాము. మాకీ విఖ్యాతి యావదాంధ్ర వాఙ్మయోపాసకుల సహకారాదరాల వల్లనే లభించింది. ఇక ముమ్ముందు కూడా భారతి కీ ప్రసిద్ధి ఇదేవిధంగా దక్కగలదని ఆశిస్తున్నాము.

ఇటీవల ఆయా సారస్వత విభాగాలలో ఉత్తమ రచనల ప్రచురణకై యథాశక్తిగా ప్రయత్నిస్తున్నాము. అయినాకొంత అసంతృప్తి తప్పలేదు.

విమర్శన పదానికి నేటి వాడుకలో సహృదయ దృష్టిలేని ఖండనమనే అర్థచ్ఛాయ స్ఫురిస్తున్నది. మనకిది వెనకటి తరాలనించి సంక్రమించిన సంప్రదాయం. ఈ పద్ధతి హర్షించి ఆమోదించదగిన అభివృద్ధి కాజాలదు. నేటి సారస్వత విమర్శనలలో పక్షపాతధోరణి నానాటికీ శ్రుతి మించిపోతున్నది. నిష్పాక్షిక దృక్పథం చాలా అరుదుగా కనిపిస్తున్నది. ఆపైన వేర్వేరు దృక్కోణాలతో నూతన సమీక్షా ధోరణు లవలంబించేవారిని వేళ్లమీద లెక్కించవచ్చును. సరి అయిన సారస్వత విమర్శన లేకపోవడమే అధునాతన వాఙ్మయ ప్రమాణాల అవ్యవస్థకొక ప్రధాన కారణం.

పరిసర సాంఘిక రాజకీయ ప్రభావాలెంతగా అధిగమించాలని ప్రయత్నించినా వాఙ్మయంలో ఆయా పరిస్థితులు పరోక్షంగా ప్రతిఫలిస్తూనే ఉంటాయి. ఇందువల్లనే అధునాతన సమస్యలకు సంబంధించిన ఆర్థిక సాంఘిక తాత్త్వికాది విషయాలపై రచనలు ప్రచురిస్తున్నాము. ఇంకా వేర్వేరు

శాస్త్రీయ విషయాలపై అందరికీ సులభగ్రాహ్యములైన వ్యాసాలు ప్రచురించాలని సంకల్పించాము. ప్రత్యేకంగా ఈ విధమైన రచన లెక్కువగా రావలసి ఉన్నాయి.

కొంతకాలంనించి భారతిలో ప్రచురించిన నాటికలకు విరివిగా ప్రజాదరం లభిస్తున్నది. ఇలాగే పద్య గేయ రూపికలు కూడ ప్రోత్సహించాలని నిశ్చయించాము.

కథలలో ఆశించినంతగా ఉత్తమ రచనలు రావడం లేదు. మన దేశంలో ఆయా తరగతుల జీవన సరణి సన్నిహితంగా చిత్రించే కథానికలు చాలా తక్కువగా కనిపిస్తున్నాయి. ఏ సారస్వతశాఖలోనయినా కేవల సాంప్రదాయిక ధోరణులే అభిమానించడం భారతి కభిమతంకాదు. కవితలో వృత్తాలే ప్రచురించడం కూడా మా తాత్పర్యం కాదు. వివిధ ఛందో వైవిధ్యాలతో నూతన కవిత అభిమానించాలనే మా ఆశయం. వాఙ్మయంలో రాజకీయ పాక్షికతవైపెన్నడు భారతిదృష్టి ప్రసరించలేదు. పరిణత సాహిత్య దర్శనమే భారతి ప్రత్యేకత. నేడొక విధమయిన మాంద్యం మన వాఙ్మయంలో గోచరిస్తున్నది. సారస్వత క్షేత్రంలో ప్రసిద్ధులయిన పెద్దలు కొందరు వృద్ధులయినారు. నూతన మార్గాలవలంబించిన కొందరు యువకులలో అనిశ్చితస్థితి ఏర్పడింది. ఒకనాటి కొంగ్రొత్త పద్ధతులీనాడు బాగా పాతపడిపోతున్నాయి. అయితే వ్యక్తులు వృద్ధులయినా సాహిత్య తారుణ్యం నిత్యనూతనమే. సారస్వతవ్రతులకిది వేరుగా విన్నవించ నక్కర లేదు.

మహాంధ్రం నేడొక నూతనోత్సాహంతో తొణికిసలాడుతున్నది. ఆంధ్రజాతియత సమగ్రంగా పునరుజ్జీవింప జెయ్యాలనే దీక్ష సర్వత్ర గోచరిస్తున్నది. వాఙ్మయంలో, కళలలో ఈ జాతీయతా సమ్మిళితమైన వ్యక్తిత్వం అత్యంతావశ్యకమని మా నమ్మిక.

సాహిత్య పత్రికా నిర్వహణం సులభసాధ్యం కాదు. ఎంతో పురోగమించిన పాశ్చాత్య దేశాలలోనే సారస్వత పత్రికల మనుగడ క్లిష్టంగా ఉన్నది. ఇక మన దేశం మాట వేరే చెప్పనక్కర లేదు గదా! అయినా భారతి నానాటికీ సహృదయ పాఠకుల ఆదరణ చూరగొంటున్నది. ఈ ఉత్సాహంతోనే తిరిగి ఆంధ్రభాషా సారస్వతోపాసనకు, పరిశోధనకు, కళాభివృద్ధికి అవిరళ కృషి చెయ్యవలెనని మా పత్రిక సంకల్పించింది. పాఠకులు, రచయితలు, అభిమానులు భారతిసమర్చనకై ఇతోధికంగా బద్ధకంకణులు కాగలరని ఆకాంక్షిస్తున్నాము.

# ఎక్బాల్ ఆత్మరహస్యము

శ్రీ బూర్గుల రామకృష్ణరావు

నా భావపాశంబు నా స్థితిత్వగతి దాఁటి
గంతువేయుని లేఁడిఁ గట్టివైచు ;
నా పుష్పవనముల నర్తించు నెప్పుడు
మొలవని పలు పచ్చికల బయళ్ళు ;
నా యొడుల్ నింపును నానావిధంబులౌ
కొమ్మల దాఁగిన కుసుమ చయము ;
నా వీణె మీటిన, నాదించి జగ మెల్ల
విశ్వనాదులు మ్రోఁగ విరతిఁ జెందు ;

భవ్య పరిమళ శోభిత భావగరిమ,
క్రమరాగాత్మకములైన గానగతులు,
లలిత సంపద లెన్నియో గలిగియుండుఁ,
దెలియనేరరు సహచరుల్ తెలివిమాలి.

జగమునఁ గ్రొత్తగాఁ బొడమి జాగృతినందిన భానుమూర్తినిన్,
గగనపు తీరులన్, నదులఁ గాంచఁగలేదు, భ్రమించు టెట్లో? నా
మగఁటిమిఁ జూపి తారలను మ్రందిలఁ జేయఁగఁ బోవ నెన్నడున్,
భుగభుగమంచు పారదము పొంగఁగలేదు మదీయ దృష్టిచేన్.

సాగరవీథి నా విపులతత్వమరీచులు తాండవింపఁగా
మ్రోఁగఁగలేదు ; నా యరుణమోహన వర్ణము లింక చింద లే
దే గిరిసానుదేశమున, నెల్లు భరించెదనంచు విశ్వమే
దాఁగిలిమూఁత లాడెడిని, "దాయ" వడంకును నన్నుఁ గాంచినన్.

నా సౌధాగ్రము భానుమండలము, నా నమస్కారముం జేసి యే
పాసెన్ రేయి, హిమాంబుబిందువులచే వాసిల్లె పృథ్వీసుమం,
బానన్ బ్రాగ్దిశఁ జూతు నుజ్జ్వల సముద్యత్సిద్ధికై నెమ్మమై
నే నందేహము లేక అర్ఘ్యములకై యేలెంపు పూజారతుల్.

వినుకటి మిత్రులెల్ల నను వీడిరి ; నాకు నిరాశ హెచ్చె ; నా
ఘనమగు "తూరు" కొండ నిదె కాల్చుచునుంటి "కలీము" రాకకై
వనరుచు ; మిత్రవారినిధి వారిచయంబులు నిశ్చలంబులై
తనరెడు నా హిమాంబులగు శ్యామతరంగములన్ మహాంబుధుల్.

వేరొక లోకమందుఁ బ్రభవించె మదీయ మనోజ్ఞ రాగముల్;
వేరొక సార్థవాహమును వేకువగంటలు మేలుకొల్పెడిన్;
ఆరయ నెందరో సుకవు లంతము నొంది జనించినారు వే
మారులు కన్నుమూసికొని, మా కనుమూతలు విప్పి రెంతయున్.

ఏ నొక పాంథుఁడన్; జగములెల్ల మదీయ వియోగవేదనా
ధ్యానము చేత నింపుటయె ధర్మము నాకు ; లయోగ్రవహ్నులన్
గానఁగఁ బ్రౌఢి రేపెదను ; గానము తంత్రుల శక్తిమించినన్
నేను చలింపఁ ; బాడెదను నిక్కము వ్రక్కలుగాఁగ వీణియల్.

ఈవి యొడరివేని వెన నీదుము నాదు నగాధవారిధిన్
నీవొక మేరువేని వడి నింపుము నీయెద నా పిడుంగులన్
జావఁక లేదు ముంచితిని నర్వజగం బమృతంపు సోనలన్
జీవిత మర్మసూత్రముల సిద్ధరహస్యము లెల్ల దాఁచితిన్.

ధర పెరిగింతు వాక్కులకు సుధామధురోక్తుల సొంపు నింపుచున్ ;
నరములఁ గూర్తుఁ గన్గవల జార్చిన ముత్తెపుఁ జిన్నిచుక్కలన్ ;
మరియొకసారి "రూము" గురుమాన్యుని భక్తిమెయిన్ దలంచి త
త్పరమరహస్యశాస్త్రముల భావసుబోధల నుద్ధరించెదన్.

అతఁ డొక దివ్యకాంతిమయుఁ ; డతనిజ్యోతి వెలుంగు నెమ్యొకన్
నతముగ ; విస్ఫులింగగతిఁ జల్లఁబడున్ తృణమందు నా ప్రభల్
అతని సుదీపికోజ్జ్వల శిఖాళినిఁ గాల్చితి నాదు రెక్కలన్
అతని సుధాప్రవాహ విలయంబులె ముంచెను నాదు పాత్రలన్.

(ఇక్బాల్ కవి "అస్రారెఖుదీ"లోని కొన్ని పద్యములకు అనువాదము.)

సొత్తిలి చదువుదు నుబ్బుచుఁ జదుచు
వర్తితి భట్లు కైవారంబు సేయ
శ్రుతిఁ బంచగద్యముల్ రుద్రమహిమయు
శతకంబు శివతత్త్వసార మాదిగను
గద్యపద్యము లాకొంతుఁ జదువుదును—"

పాద. 581.

ఇందులో పంచగద్యలేవో మన కెఱుకపడలేదు. మల్లికార్జున పండితుఁడు గద్య కృతులు రచించుట వాస్తవమే. సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రమున నే కాక తన ప్రాథమిక కృతియగు అనుభవ సారమునను పండితారాధ్యుఁడు గద్యకృతులు రచించినట్లు చెప్పియున్నాడు.

అ. సా. "ఎట్టులనుచు సంశయింపక శివతత్త్వ
సార గద్యపద్య సమితి శివుని
మహిమఁ దెలిపినట్టి మల్లికార్జున పండి
తయ్యగారిఁ దలఁతు ననుదినంబు."

పై పద్యమున 'గద్య' పదము మహామనీషులకు గూడ నెంత భ్రాంతి కలిగించినదో చూడుఁడు. దీనిఁ గూర్చి సుగృహీతనాములు, కీర్తిశేషులు, తత్త్వవేత్తలు కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారిట్లు వ్రాసిరి.

"దీనినిబట్టి చూడఁ బండితారాధ్య శివతత్త్వసారమను గ్రంథమును గద్యపద్యములుగఁ జేసినట్లు కానవచ్చుచున్నది. 'గద్య' అను పదము 'హృద్య' కు మాఱుగా లేఖక ప్రమాదమునఁ బడినదేమో! అట్లు గాక, గద్యపద్యముల పాఠమే నిజమగు చేని పండితుఁడు గద్యమందును నొక శివతత్త్వసారమును రచించియుండును. ఇప్పుడు మనకు దొరికినది కేవలము పద్యమయము. ఇందే కొంత పద్యమున్నచో యిల్ల లేఖకుడు దానిని మాత్రము వ్రాయకుండునా?" శి.త. 10 వ పుట.

కాని యిచట పరిష్కర్తలూహించిన గద్యము— అనగా నేటి వచనము ప్రసక్తమే లేదు. అనాడు శైవవాఙ్మయమునం దట్టిది లేదు. అచ్చట శివతత్త్వసారము, గద్యకృతులు, పద్యసమితి, శతకములు, (శ్రీగిరి మల్లికార్జున శతకము) అని యర్థమే కాని వేఱు కాదు.

ఇంతకు, మల్లికార్జున పండితుని కృతులకు పంచ గద్యలేవియో తెలియదు. బాణగద్య వెనుక చెప్పిన పంచ గద్యలును, పండితు కృతులని చెప్పుటకు వీలుకాక యనుపపత్తి యున్నది. సోమనాథుఁడు మహిమ ప్రకరణములో బాణగద్య గూర్చి చెప్పిన వెనుక, కవికుల గురువు కాళిదాసుకూడ నొక గద్య చెప్పినట్లు వ్రాసియున్నాడు.

"కడిది దానవుఁ డుక్కడన కాళిదాసి
కన్నులు రెండు నతఁడు కెలంకి
పన్నగ ధరు పదాబ్జముల కర్పించి
ధర కాళిదాసి గద్యంబునాఁ జెప్పి
వరభక్తియుక్తి నీశ్వరుని నుతించి."

మహిమ 107

దాసు అనుపపన్నమనకు—దాసి అని సోమనాథుని వాడుక-(చెన్నూర కాళిదాసికవి) అని యభిధానమున నున్నది. ఈ పంచగద్యలలో కాళిదాసు గద్యము కూడ చేరెనేమో తెలియదు. కావున, పంచ గద్యలేవో మనకు స్పష్టముగా తెలియనప్పుడు, సోమనాథుడే స్పష్టముగా నాసందర్భమున చెప్పనప్పుడు, అవి యన్నియు పండితారాధ్య కృతులనుట యెంత మాత్రమును సరికాదు.

ఇచట నే నుదాహరించిన వాక్యము వెనువెంటనే మరియొక వాక్యము కలదు.

"అవి కాక మల్లికార్జున పండితారాధ్యుని 'లింగోద్భవ గద్య' 'శ్రీముఖ గద్య' ప్రసిద్ధములు. శ్రీముఖగద్య తెనుగు వచనము అని కొందరి యభిప్రాయము. అనుపలబ్ధమగు శ్రీముఖ గద్య ఆంధ్ర వచనములో కొత్త అధ్యాయము" పైని యుదాహరించిన వాక్యములోని లింగోద్భవగద్య-శ్రీముఖగద్య అని వ్యాసకర్త లిఖించుటచే, వాని స్వరూప స్వభావాదుల మాట యటుంచినచో యీతనికి వాని పేళ్ళయిన

౯. ఈ సందర్భమున. కొందఱు విమర్శకులు - శతకంబు శివతత్త్వసారము - అనగా శివతత్త్వసారము శతకమని వాదించిరి. మల్లికార్జున పండితుని శతకము (శ్రీగిరి మల్లికార్జునా) అను మకుటముగల యొక శతకమున్నది. అది అనుపలబ్ధము. ఇదియున్నను, శివతత్త్వసారము శతకమనియే వారి వాదము!!! అట్లయిన ననుభవసారములో వాక్యమునకు, పరిష్కర్తల ప్రకారము శివతత్త్వసారము, శతకముగా రచించి, ఆ వెనుక గద్యముగా చెప్పినాడని చెప్పవచ్చునా? - మన విమర్శనముల తీరట్లున్నది.

సరిగా తెలియదని యనుమానింపవచ్చును. పండితారాధ్య కృతియైనది "లింగోద్భవదేవగద్య" గాని లింగోద్భవ గద్య కాదు. ఇది—పవనపోలు (పవన పోలు)లో నేటికిని గల లింగోద్భవ స్వామి పేర వెలయు శివునిపై పండితారాధ్యులచే రచించబడినది.

వెలనాటి చోడని సభలో శాస్త్రులను జయించిన పిమ్మట శివభక్తి మాహాత్మ్యమును ప్రకటించుటకు (అనగా లింగమున్న లిచ్చి. తిరిగి పడయుటకు) పండితారాధ్యుడు లింగోద్భవస్వామి దేవాలయమున కేగెను. ఈ సందర్భమున సోమనాథుడిట్లు వ్రాసియున్నాడు:

"......పండిత మల్లికార్జునుడు
...లింగోద్భవదేవు గోపురప
మంచిత త్రింశద్ధస్త దీర్ఘాంగమునన్
గోలవున్న భికులనుమ పదువాంగ
ములు వెరసి యుండంద మునార్త్రప్రెక్కె.
చెలగుచుమే లోయి తప్పిన కోగ్రనార
పలిని నితితికి విన్నప మాదరించి
యుప్పర్గిస్పని లింగోద్భవ దేవు
గద్యంబు వానిపై గద్యంబు చెప్పి
జేసిజేవకు వాడిమ దిక్కులింగ
దేవు లింగోద్భవ దేవు నా ఖ్యానము
లోద్యత్తిరంబుగా స్తోత్రంబు జేసి" మహిమ పుట. ?8

దీనినిబట్టి యీగద్య పేరు. 'లింగోద్భవ దేవగద్య' యని రూఢియగుచున్నది.

ఇక 'శ్రీముఖగద్య'ను గూర్చిన చర్చ: ఈ గద్యకు శ్రీముఖదర్శనగద్య అని పేరు. బసవపురాణము (ఆంధ్ర ముద్రణ పుటలు 66, 67)లో నిట్లున్నది. "మల్లికార్జున పండితుడును. ఈ ఘన పేర్ల గ్రంథములు రచించెను. అందునకవని విస్తారమును తెలియజాలక దానిని నేను ప్రాచ్యలిఖిత పుస్తకాలకై సేకరించితిని. ఇప్పుడు పంజీయుక్త శ్రీముఖదర్శనమునుదానిం గనుగొన గల్గితిని. దాని యాద్యంతము లిట్టివి.

ఆది: త్రైలోక్య సర్వ భావా శివ నిగ్రహానుగ్రహ హేతువు,
శ్రీ విశ్వేశ్వర మాం పాహి మహేశ్వర విరేశ్వర.

జయ, జయరుద్ర, వీరభద్ర, విరించి పంచమ శిరఃఖండన, యజ్ఞపురుషశిరఃఖండన......,

అంతము: మల్లాణప్రియ, భిలాణప్రియ, కుమ్మర గుండయ్యప్రియ, అఖిలభువన భక్తజనప్రియ, దేవా, సురపతి ప్రముఖ నిఖిల ప్రార్థిత పరమేశ్వర, దేవా! నమస్తే నమస్తే నమః.

శ్రీమాన్ మహేశ్వర కృపో మల్లికార్జున పండితః,
శ్రీముఖ దర్శనగద్యం వ్యాకరోత్(సం)గ్రథితవాన్."

ఇట్లు, 'ప్రశస్తముగా' అద్యలో కవిపేరున్నది. కాగా, వ్యాసకర్త "అనుపలబ్ధము శ్రీముఖగద్య" అని వ్రాయుట యెట్లో పాఠకులూహింపగలరు! అనుపలబ్ధమని వ్రాయుటచే వ్యాసకర్త శ్రీముఖ దర్శనగద్య చూచి యుండలేదని స్పష్టము. అందుచేతనే వానికి విషయములు కూడ తెలియలేదనుటయు స్పష్టమే.

పై నిర్ణయమునుబట్టి, పండిత గద్యలలో మల్లికార్జున పండితుని రచనలు ఏవియున్నవో మనకు తెలియగాలేదనియు. వారివి గద్యత్రయములు మూడు లింగోద్భవదేవ గద్య—అక్షరాంక గద్య—శ్రీముఖ దర్శనగద్య—అనునవి యీనాటికి లభ్యములుగా తెలియుచున్నవని తేలినది. వీనిలో లింగోద్భవదేవ గద్య లభ్యము కాలేదు.

మనకు దొరికిన పండితుని గద్యాత్రయము—అక్షరాంక గద్య, శ్రీముఖదర్శన గద్య అనువాని మాట విడిచి. దొరకనట్టి లింగోద్భవదేవ గద్యను గూర్చి, వ్యాసకర్త వ్రాసినది వినుడు! "ఇః లింగోద్భవ గద్య—ఇదికూడ అనుపలబ్ధము ఎక్కాప్రగడ (ఎర్రాప్రెగడ యని యుండవలెను) నృసింహ పురాణములో స్తంభోద్భవ గద్యమొకటి కలదు. లింగోద్భవ స్తంభోద్భవ నామసాదృశ్యము గమనార్హము" (పుట 22) ముందు నేను వివరించిన రీతిని ఈ గద్యను లింగోద్భవదేవ గద్య యనవలయును. అదియే దాని పేరు. అటువంటి దానిని స్తంభోద్భవ గద్యతో పెట్టి నామసాదృశ్యము వచ్చినది! 'లింగోద్భవ' అను సమాసములోని 'ఉద్భవ' పదమును, 'స్తంభోద్భవ' లోని ఉద్భవ పదమును నొకటిగా భావించి వ్యాసకర్త ఇట్లు వ్రాసినారు. స్తంభోద్భవ గద్య (గద్యయని ముద్రితమున లేదు. స్తంభోద్భవ దండకము అని కలదు. చూడుడు. ముద్రిత ప్రతి పుట 179. పంచమాశ్వాసము 82) యనునది నృసింహస్వామి స్తంభమునుండి యుద్భవించిన సమయమున చెప్పినది లింగోద్భవదేవ గద్య—లింగోద్భవస్వామి యనిపేరుగల శివునిపై చెప్పినది.

6 దీనిని నేను భారతి "ఆంధ్రోత్సవ సంచిక" యందు ప్రకటితమైన ఆంధ్ర వీరశైవ వాఙ్మయమున ప్రకటించియున్నాను.

కం. ఛందోగణములవియతిం
బొందక తొల్లి ప్రమాణముఁ గఱుఁజెలంపై
కొందఱిచే దిద్దఁబడెం
బందముగాఁ దాశరథి యఁబోడొంకున్.

ఇచటపదము అనితప్ప వచనము అనుమాటయే లేదు.

(7) "అప్పాంటే కుతిపాంత పూతిరసవాదిగ్రాహ్యతి అని అరవశతాబ్ది నైషధశ్లోక సమాసరచనము." పుట22. నైషధము అరవశతాబ్ది కాదు. నైషధీయ చరిత్రకావ్య కర్త శ్రీహర్షుఁడు, కన్యాకుబ్జాధీశ్వరుఁడైన జైత్రచంద్రుని యాస్థానమున నున్నవాఁడు. ఆరాజు దానశాసనముల వలన వారిరువురు క్రీ. శ. 12-వ శతాబ్దివారన్నట్లు స్పష్టము.

(8) పుట 19 "పొత్తపి వేంకటరమణకవి లక్షణశిరోమణి"-అ. వేంకటరమణకవి గ్రంథము పేరు లక్షణదీపిక — కాని లక్షణశిరోమణి కాదు. లక్షణశిరోమణి గంపరపు వేంకటకవిది. లక్షణదీపిక యచ్చుపడలేదు. వ్యాసకర్త తా నే గ్రంథమునుండి గ్రహించెనో చెప్పలేదు.

(9) స్వవచన వ్యాఘాతము. 19-వ పుటలో— "అచ్చాపిని లలిత పదమైనది చూర్ణము. అదియే చూర్ణికము అనఁగా నది సంక్షిప్తము. మఱి చూర్ణిక ద్విపదవ, బహువిధవ సందర్భములకు ఉభయక్తమనఁదగు సమాపాది విమాపాదిత కల్పావాకల్ప కల్పితము. అనఁగా నది దీర్ఘసమాస వచనము. కనుక సంస్కృత చూర్ణములు తెనుఁగు చూర్ణిక లక్షణమునకు జాతియే భిన్నములని స్పష్టము. అయినను సభిన్నములని యొకరివ్రాత!—అది మరి యవిచారిత రమణీయము."

ఆ పుటలోనే, కొంత వెనుక—
"అనఁగా సంస్కృతములోని చూర్ణము, చూర్ణికము, తెనుఁగులోని చూర్ణికనము రీతిభిన్నముగా నొకటే"— అని వ్రాసిరి.

"అభిన్నములని యొకరి వ్రాత! అది అవిచారిత రమణీయము" అన్న వాక్యమిప్పుడు వ్యాసకర్తకే అన్వయించుచున్నదిగదా!

10. పుట 20-"పద్యగద్యాత్మకమైన చంపూరచనము ప్రత్యేకాంధ్ర సంప్రదాయము. కారణము సంస్కృతచంపూకర్తలయిన యనంతకవి (భారతచంపుకర్త), లక్ష్మణకవి (రామాయణ చంపుకర్త) ఆంధ్రులగుటయే."

వ్యాసకర్త తెలుఁగులోనే కాక సంస్కృతమున కూడ తనకుగల యనభిజ్ఞతను వెల్లడించినాఁడు. అతని యభిప్రాయము ననుసరించి, భారత, రామాయణ చంపువులు రెండును సంస్కృతమున నన్నయకన్న మున్నుగా వెలసినవన్నమాట! అట్లయిన నింతకన్న హాస్యాస్పదమైనది వేఱొకటి లేదు. భారతచంపూరచయిత అనంతభట్టు కాలము నిశ్చితము కాలేదు. అర్వాచీనుఁడనియే సంస్కృతసారస్వతచరిత్రకారుల యభిప్రాయము. ఇక చంపూరామాయణకర్త లక్ష్మణకవి యనుట మహాదోషము. చంపూరామాయణకర్త సంస్కృతభాషావ్యాకర్త భోజమహారాజు. యుద్ధకాండమొక్కటియే లక్ష్మణకవి రచనము. అతఁడర్వాచీనుఁడు. అసలు భోజరాజే నన్నయ, రాజరాజనరేంద్ర నరేంద్రుల సమకాలికుఁడైనప్పుడు, లక్ష్మణకవి యావెనుకటి కాలమువాఁడు; క్రీ. శ. 12-15 శతాబ్దుల మధ్యమునన్న వాఁడు.

చంపూపద్ధతిని నన్నయకుఁ బూర్వుండే కన్నడమున రత్నత్రయము పంప, పొన్న, రన్నకవులు ప్రచారములోనికిఁ దెచ్చియున్నారు. ఆ కాలమున తెనుఁగు కన్నడ భాషలకుఁగల సన్నిహిత సంబంధమువలన తెలుఁగు కవులు ఈ పద్ధతిని వారినుండి గ్రహించిరి. కారణమిది కాని, చంపూభారత రామాయణకర్తలాంధ్రులగుట వలన గాదు. అట్లయిన భోజరాజాంధ్రుఁడేనా? అనంతభట్టు, లక్ష్మణకవియు, నాంధ్రులని నిశ్చితమేనా? వారు మహారాష్ట్రులని చాలమంది విద్వాంసుల యభిప్రాయము.

(11) 18వ పుట— "నన్నయభట్టు భారతావతారిక. ఇట వచనశబ్దార్థము కేవలము" అను వాక్యమునకు తరువాత నిట్లున్నది. "ఇంతకంటె స్పష్టముగా వాడినది తిక్కనసోమయాజి నిర్వచనోత్తర రామాయణమునందే తన్నిదర్శనము. గ్రంథనామమునందే గద్యమునకు వచనమని స్పష్టపడెను. తిక్కన వాడిన నిర్వచనశబ్దము నిర్దుష్టము కాదు; నిర్దిష్టము. ఈ ఉత్తర రామాయణములోని వచనశబ్దవాచ్యార్థము, విరాటపర్వాదిగాగల గద్యశబ్ద గర్భితార్థము నొకటే."

పై వ్రాతనుబట్టి వ్యాసకర్త తిక్కన కృతిమైన యీ ఉత్తర రామాయణము ముద్రితప్రతినైన సరిగ చూడ

లేదని స్పష్టమగుచున్నది. తిక్కన తనకృతిలో నిర్వచనోత్తర రామాయణమని యెచ్చటను వాడియుండలేదు. ఆశ్వాసాంతాద్యలలో గ్రంథ నామమును పేర్కొను సప్పుడును తిక్కన వాడలేదు. అందలి యాశ్వాసాంత గద్య యిది.

"ఇది శ్రీ మదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మదుత్తర రామాయణంబను మహాకావ్యము నందలి దశమాశ్వాసము."

మఱియు - "ఈ త్తర రామాయణోక్తి యుక్తుండ నయితిన్" అని తిక్కనయే చెప్పియున్నాఁడు.

మదరాసు ప్రభుత్వమువారు ప్రకటించిన గ్రంథ సూచికలో తాళపత్ర ప్రతులు వివరించు సందర్భమున నిది ఉత్తరరామాయణముగ్రంథమే, అకారాద్యనుక్రమణికలో చెప్పఁబడినది గాని, నిర్వచన- అని నకారాదిగా లేదు. (చూడుడు—సంఖ్య 2 నుండి 10 ప్రతులు)

తిక్కన గద్యశబ్దము, విరాటపర్వాదినే యుపయోగింపలేదు. ఉత్తరరామాయణమున నే యుపయోగించియున్నాఁడు. వ్యాసకర్త చూడలేదేమో? "వాక్య సాంగత్యము చేయుటకో సైన—గద్యముతో కూడి చెప్పిరట"......

(12) పుట19. "లక్షణములనుబట్టియే కాక లక్ష్యములనుబట్టియు సంస్కృతమార్గము, తెనుగు మార్గిక భిన్నతరగతులే. ఎఱ్ఱాప్రగడ ('ప్రెగడ' సరియగు రూపము) హరివంశములో ఒక మార్గిక కలదు. అది మార్గిక అని 1901 సంవత్సరమందలి ముద్రిత ప్రతిలో అతిస్పష్టము. ఆ మార్గిక దిష్టాద్వితీయ సంయుక్త పదసహిత తురగతిన సంబంధము......అనంతుని గద్యోదాహరణము ఎఱ్ఱాప్రగడ హరివంశమార్గిక ఒకటే తీరు."

వ్యాసకర్త హరివంశమున నేమార్గిక యెచ్చట నున్నదో సూచింపలేదు. అది హరివంశము, ఉత్తర భాగమున పుట 280 లో నున్నది. ముద్రణములో 'మార్గిక' అని యున్నను, పరిశీలింపగా నది 'మార్గిక' కాదు. ముక్తపదగ్రస్తగద్య. చూడుడు:

"జయ జయ జగదుద్భవస్థితి సంహారహేతుగుణ
నిర్ధారణ వ్యవహిత జీకమూర్తి విలసన—
సనకాదియోగీంద్ర హృదయ సరోరుహ
సాంద్ర సంనిధానా నేక
పంకేరుహ వదన వినిస్సృతానంత
వాఙ్మయ ప్రవాహ పవిత్రీకృతాఖిలలోక-
లోకాయతాది దుస్తర్క తిమిరాంధ
దురంధకారదివ్యభాను—

భావజారాతుల ప్రణుతచారణ...నిరీక్షణ—క్షణదా...మా—మూరణ...మూన మూన-మానంద... నమస్తే నమస్తే నమః."

ఇట్లు స్పష్టముగా నిది ముక్తపదగ్రస్త గద్యయై యుండగ "నిది మార్గికయని, ముద్రిత ప్రతిలో అతి స్పష్టము" అని వ్రాయుట ఎట్లో!

(13) ఇక "అనంతుని గద్యోదాహరణము, ఎఱ్ఱాప్రగడ హరివంశ మార్గిక ఒకటే తీరు" అన్న వాక్యమును చూతము. అనంతుని గద్యలో "స్వస్తి సమస్త భువనరక్షా దక్ష శ్రీపుండరీకాక్ష, భుజగపతి సింహాసనారూఢ సురనికరమకుట తట ఘటిత సురుచిరమణిగణ ప్రభాభాసిత పాదపీఠ, వేద వివాదానుకార గౌరవ లలితనూపురాలంకృత చరణ సరసిజ యుగళ...... శ్రీ యనంత పద్మనాభ నమస్తే నమస్తే నమః" అని యీ విధముగా దీర్ఘ సమాసయుక్తమై యున్నది గాని ఎఱ్ఱన హరివంశమునందు గల గద్య వలె, ముక్తపదగ్రస్తముగా లేదు. (చూడుడు: ఛందోదర్పణము 2 అ. 8) అప్పుడు "రెండును ఒకటే తీరు" అని చెప్పుట సరియగునా? ఎఱ్ఱాప్రెగడ, అనంతుని యుదాహరణములు భిన్నములుగా నున్నప్పుడు— గద్యము—మార్గిక—ఒకటియే యను వ్యాసకర్త మాట నిశ్శబ్దమాటలయినది గదా!

(14) పుట 23-"పాల్కురికి సోమనాథుని నమస్కారగద్య, చంద్రప్రకార గద్య, అక్షరాంకగద్య సంస్కృతములే."

ఇచ్చట వ్యాసకర్త యభిప్రాయము సోమనాథుని గద్యలు, సంస్కృత భాషకేగాని, తెనుఁగునకు సంబంధించి యుండలేదని కాఁబోలును! దీనిని బట్టి సోమనాథుని గద్య రచనలు వ్యాసకర్త చూడకుండగనే వ్రాసినారనుట "స్పష్టము."

సోమనాథుని గద్య కృతులు సంస్కృత భాషా నిబద్ధమైన తెనుఁగు కృతులు. ఇవి యన్నియు లయాత్మకాన్వితముగా సాగెడిగిన రగడ భేదములు

తెనుగునకు విశిష్టములు యతిప్రాసలిందు పాటింపబడి యున్నవి.

పై వానిలో (1) సమస్కృత గద్య, మధురగతి రగడ ఏకతాళము.

“అసిత శ్రీ ప్రమథేంద్రాయ నమో
విశ్వగతి హృదిత తంద్రాయ నమో.

(2) పంచప్రకార గద్య—

మొదటిది. ఉత్కలిక. రెండవది, మూడవది మధురగతిరగడ. నాల్గవది ద్విరదగతి. అయిదవది మధుర గతి రగడ.

(3) అక్షరాంక గద్య—ఖండగతి ద్విరదగతి రగడ. 10

గద్యము, రగడను ఒక్కటియే అని వ్రాసిన వ్యాఖ్యాత పాల్కురికి సోమనాథుని దివ్యమైన “గద్యము”లకు “రగడలు” అని వ్రాసినాడని చూపిం సమంజసముగ నుండెడిది. అట్టి యూహా యాతనికి తోఁచియుండదు. సోమనాథుఁడు “గద్య” అను పదమును నుపయోగింప లేదు

ఇక యాతని వాక్యము. “పాల్కురికి సోమనాథునికి బహుపూర్వము గద్యలు బహురగడలలో కవు”. పుట 48.

సోమనాథునికి పూర్వము బహురగడలలో గద్యలున్నవని వ్యాఖ్యాత వ్రాసినాడె! ఆ బహురగడ లేవి? ద్విపద కవ్యడు మఱి యాళములా? మహాభక్తి, శివదేవి, మాగధి మొదలగు ప్రాకృతములా? ఒక్క యుదాహరణమైన చూపలేదె!

ఇట్టే చూపుచుఁబోయిన నెన్నియో చూపవచ్చును. విస్తరభీతిని విరమించితిని. ఇట్టి రచనల కెట్టి నామము నీయఁదలఁచో ప్రాజ్ఞులైన భాషాసాహితీ వేత్తలు తెలుపుదురుగాక!

---

10 సోమనాథుని గద్యకృతులనుగూర్చి ప్రత్యేకముగ, “పరిశోధన” పత్రిక ప్రకటించిన పాల్కురికి సోమనాథసంచిక (అక్టోబరు 1955)లో సంపూర్ణముగ చర్చించితిని. అందుచే వివరముల నిట లేదు.

# హేమంత సంక్రాంతి

శ్రీ కనగవ నరసింహస్వామి

కుంతల వీథికాగ్రమున గ్రుచ్చిన బంతులు, సౌరభోర్మికా
సంతతి వీచుచుం బవనసారణి నింప; హిమావగుంఠనా
క్రాంత శరీరభారనవకమ్ములు జిమ్మను నేగుదెంచె హే
మంతము, మెట్టినిల్లు చను మానిని వోలె నమందయానయై.

స్వేదజలమ్ము తోడి మొలిపించిన సస్యము, హేమవల్లరీ
సోదరమయ్యె చేడనుచు జొక్కుచు నార్చి; స్వగేహికా కలా
తూదంవీతగా వ్రతము లానుచు, కీనుల తన్మృదూక్తులం
జేదును, గాదె బోసిరి కృషీవలు లెల్లన శాలిధాన్యముల్.

బారలుకట్టి మింట పసివారుగ నేల ఖగమ్ము లొక్క కే
దారనవీనఖల్యగని, ధారణికిం డిగి, గింజగింజగా
కేరుచు సంగ్రహించి, మెలుగించెను; తత్ప్రముదంచితస్వర
శ్రీరమమాణలై జనపచేల తలెత్తిరి కాపుచేడియల్.

శాంతి లభించె దేశమున సౌఖ్యము నిండెను, సంతతక్షుధా
చింతనులైన పేదలకు చిత్తము లించుక సేద దేరె న
న్నంత పథిస్థ యాచకసమాజము చూపులు ద్రావ వచ్చె సం
క్రాంతి, సుగీతవేషణ ధురంధరుడై హరిదాసు కొల్వగా.

మనసిభవుండు భోగిచలిమంటలు చుట్టను పుష్పచాపశిం
జిని రవళించుచుం దిరిగె సిద్ధమనోరథుడై; వియోగినీ
జనములు దీర్ఘయామినుల జార్చిన లోచన బాష్పవారి వీ
చెను బవనమ్మనంగ మెఱసెం దృణాలగ్న తుషారబిందువుల్.

అరుణసరోరుహాక్షి సమదారుణ దృష్టులు, పుండరీక సుం
దరధవళాయతాక్షి తెలినవ్వుల చూపులు, మేచకోత్పల
స్ఫురదురునేత్ర నీలి జిగి చూపులు గూడి త్రివర్ణ శోభలం
గురియుచు నున్న ముగ్గు లవిగో! భవనాంగణ శుభ్రసీమలన్.

భూతలనాకముల్ శ్వశురపూజ్యగృహమ్ములు, నవ్యనవ్య జా
మాతృవధూ వచోవలయ మంజులముల్ గనులారగాంచి, ఆ
శాంతుగుడైన సూర్యుడు, సహస్రకరమ్ముల తోడ నుత్తరా
శాతరుణోపగూహనము సల్పగ సాగెను తేజి తేరుపై.

# అర్థశాస్త్ర పితామహుడు-ఏడమ్‌స్మిత్

శ్రీ బులుసు వేంకటసుబ్బారావు

అది పదిహేడువందల ఇరవై మూడవ సంవత్సరం. ఒకనాటి ఉదయం బాలభానుని దివ్యకిరణాలు తిమిరమయ జగాన్ని తేజోవంతం చేస్తున్నాయి. అదే ముహూర్తంలో ఇంగ్లండు నగరంలో ఎడిన్‌బరోకు దగ్గరలో కిర్‌కాల్డి అనే గ్రామంలో, విశాలమైన ఆర్థికశాస్త్ర ప్రపంచాన్ని తన అద్వితీయమైన విజ్ఞానశక్తులతో శాశ్వతంగా తేజోవంత విలసితం చేయడానికి ఉదయించాడు ఏడమ్‌స్మిత్. నిరుపమాన ఆర్థికశాస్త్రవేత్త, అసాధారణ తత్త్వజ్ఞాని, అఖండమేధావి, అద్వితీయ తర్కశాస్త్ర కోవిదుడు, ఏడమ్‌స్మిత్ తన రచనలతో అంతవరకుగల దుర్బలమూలా, సందిగ్ధమూలా అయిన ఆర్థికశాస్త్ర సిద్ధాంతాలను పటాపంచలు చేసి, అజేయం, శాశ్వతం అయిన ఒక నూతన మహత్తర ఆర్థికశాస్త్ర సామ్రాజ్యానికి పునాదులు వేశాడు. ఆయన తరువాత ఎందరో ఆర్థిక తత్త్వవేత్తలు జనించారు. ఎన్నో నూతన గ్రంథాలు వెలువడ్డాయి, ఎన్నో విప్లవాలు వచ్చాయి. కాలాలు మారాయి. కాని హిమాలయ పర్వతములవలె ఆ మహామహుని సిద్ధాంతాలు, గంభీరాలై శాశ్వతంగా నిలిచిపోయాయి. ఆర్థికశాస్త్ర ప్రపంచంలో ఆయన పితామహుడు. ఆయన శాస్త్రరంగం మహోదాత్తంగా వృద్ధిచెందుతూనే ఉంది

పదిహేడువందల ముప్పైఏడవ సంవత్సరంలో తన పద్నాలుగవ ఏట ఏడమ్‌స్మిత్ గ్లాస్గో విశ్వవిద్యాలయంలో ప్రవేశించాడు. అక్కడే ప్రసిద్ధుడైన ఫ్రాన్సిస్ హచిసన్ అనే తత్త్వవేత్త దగ్గర గణితాన్ని, తత్త్వశాస్త్రాన్ని అభ్యసించాడు. మూడు సంవత్సరాల తరువాత ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో ఆయనకు ఉపకారవేతనం లభించింది. ఆక్స్‌ఫర్డ్‌లోనే ఆరు సంవత్సరాలు విద్యాభ్యాసం చేశాడు. విద్యాభ్యాసానంతరం ఆయనకు స్కాటిష్ ఎపిస్కోపల్ చర్చి నుండి ఆహ్వానం వచ్చింది. కాని దాన్ని ఆయన తిరస్కరించి ఎడిన్‌బరో కళాశాలలో ఆంగ్ల సాహిత్య ఉపన్యాసకుడుగా ప్రవేశించాడు. ఆయన అక్కడ చేసిన ఉపన్యాసాలలో ఎన్నో అసాధారణ భావాలుండేవి. షేక్స్పియర్ నాటకరచనా సామర్థ్యం అంతగా స్తుత్యమైనది కాదనేవాడాయన! కాని ఆ ఉపన్యాసాలలో ఆయన వ్యక్తపరచిన మేధాశక్తి, తార్కిక నైపుణ్యం ఆయనకు చాలపేరు ప్రతిష్ఠలను తెచ్చాయి. 1751 వ సంవత్సరంలో ఆయన గ్లాస్గో విశ్వవిద్యాలయంలో తర్కశాస్త్రాధ్యాపకుడుగా నియుక్తుడయ్యాడు. ఆ మరుసటి సంవత్సరమే ఆయన నైతికతత్త్వ (Moral Philosophy) ప్రధానాచార్యుడుగా నియమించబడి గౌరవించబడ్డాడు. ఈ కాలంలోనే ఆయన ఆర్థికశాస్త్ర పరిచయం సంపాదించుకొని దానిలో అధిక పాండిత్యాన్ని సంపాదించడంలో నిమగ్నుడయ్యాడు. ఆయన వ్రాసిన "ది థియరీ ఆఫ్ మోరల్ సెంటిమెంట్స్" ("The theory of Moral sentiments") అనే నీతిశాస్త్రగ్రంథం ఆయనకు మహాఖ్యాతి ఆర్జించింది. ఈ కాలంలోనే ఆవిరియంత్రం నిర్మించిన జేమ్సువాట్‌తో పరిచయం లభించిందీ, బెంజమిన్ ఫ్రాంక్లిన్ ఈయన మేధాశక్తిని ప్రశంసించినదీ ఈ సమయంలోనే.

తరువాత ఏడమ్‌స్మిత్, బాసిలా రాజకుమారునికి ఆచార్యుడుగా నియమించబడ్డాడు. ఆయనకు సాలుకు మూడువందల పౌండ్లు లభించేవి. ఈ ఉద్యోగంలో ఉండగానే ఆయన ఆర్థికశాస్త్రంలో మహత్తరమైన పాండిత్యాన్ని సంపాదించుకొని, వివిధ జాతి సంపత్తి కారణాలను, తత్త్వాలను పరిశీలన చేసి "జాతి సంపత్తి తత్త్వ కారణ పరిశీలనం" ("An Inquiry into the Nature and Causes of wealth of Notions") అనే ఆర్థికశాస్త్రగ్రంథాన్ని వ్రాశాడు. ఈ అద్భుత గ్రంథ రచనమే ఆయనకు "ఆర్థికశాస్త్రపితామహుడు" అనే బిరుదాన్ని సార్థకం చేసింది.

మున్నవారిని సందర్శించి వారితో అనేక విషయాలను చర్చించాడు.

ఏడమ్ స్మిత్ తన గ్రంథరచనలో ప్రథమంగా ఫిజియోక్రాట వాదాన్ని (జాతి సంపదభివృద్ధికి భూమే ప్రధానమనే వారివాదాన్ని) నిశితంగా విమర్శించి, అత్యంత ప్రసిద్ధమైన శ్రమ విభజన పద్ధతిని ('THE DIVISION OF LABOUR METHOd') కూలంకషంగా చర్చించాడు. ఒక దేశంలోని సకలవిధ ద్రవ్యోత్పత్తికి మూలస్థానం భూమి అని వారు (ఫిజియోక్రాట్లు) వాదించారు. వారిది మిక్కిలి సంకుచిత దృక్పథంగా కనపడింది స్మిత్‌కు. వ్యవసాయంవలన అధిక సంపత్తి భూమినుండే ఉత్పత్తివుతున్న దనడం సత్యమే అయినప్పటికీ, ఇతరాలు, ముఖ్యాలు అయిన ధన కారకాలను సంపూర్ణంగా విడిచి వేయడంవలన ఈ తరహా ఆర్థికశాస్త్రజ్ఞుల దృక్పథం అసమగ్రము, సంకుచితము అయినదనడం నిస్సందేహమైనది. సంపదుత్పత్తి సాంఘిక చైతన్య జనితమైనదే కాని కేవలం ప్రకృతి జన్యమైనది కాదని స్మిత్ వాదించాడు. మానవుని కృషివలననే ద్రవ్యోత్పత్తి జరుగుతుంది. మానవకృషి రహితమైన ప్రకృతిశక్తి నిష్ఫలమైనది. అంతేకాదు. ఈ కృషి కేవలం భూసంబంధమయినదే కానక్కరలేదు. ద్రవ్యోత్పత్తిని చేసేవారు కేవలం వ్యవసాయదారులే కారు. కృషిచేసే ప్రతి మానవుడు ద్రవ్యోత్పత్తి కారకుడే.

స్మిత్ దృక్పథంలో దేశమంతా ఒక బ్రహ్మాండమైన కర్మాగారం వంటిది. దానిలో దేశీయులంతా కార్మికులు. వివిధ కృషి ఫలితంగా, అనేక రూపాలలో జాతి సంపదుత్పత్తి జరుగుతుంది. మానవోపయోగకరమైన సామగ్రులన్నీ ఈ విశాల కర్మాగారములో నిరంతరము ఉత్పత్తి అవుతూ వుంటాయి. ఇదంతా మానవ కృషిఫలితమే గాని కేవలం ప్రకృతిజన్యమైనది కాదు. ఈ విధంగా నిరంతరం ద్రవ్యోత్పత్తికి శ్రమించే కోట్లకొలది పారిశ్రామికుల నడుమ పరస్పర సహకారం అత్యంత ప్రధానమైనది. అట్టి మహత్తర సాధనమే శ్రమ లేక కృషి విభజనపద్ధతి. దీనివలన కలిగే సత్ఫలితానికి ఉదాహరణలనిస్తూ స్మిత్ అంటాడు: ఒక సాధారణపు పనివాడు గట్టిగా శ్రమపడితే గంటకు మూడు లేక నాలుగు, అయిదు పిన్నుల కన్న ఎక్కువ చెయ్యలేడు. కృషి విభజన పద్ధతిలో అదే సమయానికి కొన్ని వేల పిన్నులు ఉత్పత్తి అవుతాయి. పరిశ్రమలో ఈ పద్ధతి ప్రకారం ఒక వంకతీగను ముక్కలు ముక్కలుగా విడగొడతారు. మరి కొందరు దాన్ని పిన్నుల ఆకారంలోనికి తీసుకవస్తారు. కొందరు పైన గుండుసూదులవలె వంచుతారు. ఇంకా కొందరు కాగితాలకు గుచ్చి, ప్యాక్ చేసి ఉంచితే కొందరు రవాణా చేస్తారు. ఇంత పనిని ఒక్కడే చేసినట్లయితే అన్ని విధాలా నష్టమే దాపురిస్తుంది. ఇప్పటి మోటారుకార్ల పరిశ్రమలో ఈ శ్రమ విభజన పద్ధతి పూర్తిగా వినియోగింపబడుతున్నది. ఎన్నో వేలమంది కార్మికులు పనిచేస్తూ ఉంటారు. ఒక్కొక్కరి వంతుకు వచ్చేపని అతి సులభమైనది. కనుక గంటకొక కారు చొప్పున కర్మాగారంనుండి వెలువడుతుంది.

ఈ విధంగా ప్రతి కార్మికుడు ఏదో ఒక నిర్ణీత విభాగంలో కృషిచేయడంవలన ఆ పనిలో అతడు ప్రత్యేకతను సంపాదించుకుంటాడు. అత్యధిక మయిన నిపుణత వస్తుంది. ఈ విధంగా ప్రతివారికి నిపుణతవచ్చి పరిశ్రమ వృద్ధిపొందడమే కాక అతిసులభంగాను, తక్కువ ఖర్చుతోను సాగిపోతుంది. పూర్తి పనిని ఒకే కార్మికుడు నిర్వహింపవలసివస్తే అతనికి అన్ని పనిముట్లు సరఫరా చేయవలసి వస్తుంది. తరువాత అతడు ఒక పనిముట్టునుంచి మరొకదానికి మార్చుకొనేందుకు అనవసరంగా కొంత కాలాన్ని వ్యయపరచాలి. ఈ విధమైన నష్టాలన్నీ కృషి విభజన పద్ధతిలో మాయమౌతాయి. ఉత్పత్తి వందలరెట్లు పెరుగుతుంది. అంతే కాక నిరంతరం ఒకే పనిచేయడంవలన దానిలోని సాంకేతికాలు తెలిసి నూతన సౌలభ్యానికి ఆలోచించ గలుగుతాడు. శ్రమ విభజన పద్ధతి వలని నష్టాలను పేర్కొనలేదని కొందరు స్మిత్‌ను విమర్శించారు. శ్రమ విభజన విధానంలో కల ఒక్క దోషాన్ని మాత్రం స్మిత్ చూపాడు. జీవితమంతా అతి స్వల్పమైన పనిని నిరంతరం చేయడంవలన ఆ కార్మికునికి మనస్సు వికాసం పొందక మొద్దుబారిపోతుంది. కాబట్టి పారిశ్రామికులకు తగిన వినోదాలను విద్యం కలిగించాలి.

కృషివిభజన విధానానికి రెండు పరిమితులున్నాయి. మొదటిది: పెట్టుబడి ధనం. ఇది లేకుండా పరిశ్రమ పురోగమించదు. రెండవది: ఆ పరిశ్రమవలన వచ్చే ఉత్పత్తికి ఉండవలసిన గిరాకీ. అది లేనప్పుడు అంత భారీగా ఉత్పత్తిచేయడం నిష్ప్రయోజనం. ఒక

పరిమిత ప్రాంతానికి సరిపడే వస్తువులను తయారు చేయడంలో ఈ విధానం ఉపయోగించడంవలన సరఫరా, గిరాకీకంటె బాగా మించిపోయి పారిశ్రామికునికి నష్టాన్ని కలిగిస్తుంది. మరికొన్ని పరిశ్రమలలో— ఉదాహరణకు వ్యవసాయంలో ఇటువంటిగా ఉపయోగపడదు.

ఒక వృత్తిలో పరిశ్రమచేసి దానిలో నిపుణత సంపాదించడానికి ఒక వ్యక్తికి ఆ వృత్తివిద్యలో స్వాభావికమైన, వంశపారంపర్యమైన అభిరుచి, స్వతస్సిద్ధమైన ప్రతిభ ఉండాలన్న ప్లేటో వాదాన్ని ఏడమ్‌స్మిత్ ఖండించాడు. కేవలం నిరంతరాభ్యాసం వలనే ఒక వృత్తిలో నిపుణత వస్తుందని, స్వాభావికమైన ప్రతిభవలన అటువంటిది అలవడదని స్మిత్ అన్నాడు.

ఏడమ్‌స్మిత్ దృక్పథంలో ఆర్థిక శాస్త్రం అంతటా ఒక మౌలసిద్ధాంతంపై ఆధారపడి ఉంటుంది. అదే ప్రకృతి సిద్ధాంతము. ఆర్థిక వ్యవహారాల ప్రకృతి తత్త్వ నిరూపణమే ఈ సిద్ధాంత లక్ష్యము. ప్రతి ఆర్థిక విషయము ప్రకృతి సహజమైనదే (Natural). అన్ని వ్యవహారాల వెనుక ఒక అజేయమైన అనంతమైన ప్రకృతిశక్తి ఉండి, వానిని నడిపిస్తుంది. ఏ ఆర్థిక విషయముకూడా మానవ నిర్మితమైనది కాదు. ఏడమ్‌స్మిత్ వాదం ప్రకారం ఈ ప్రకృతిశక్తి, మానవ శ్రేయోదాయకమైనది. తత్త్వశాస్త్రంపై స్మిత్ వ్రాసిన "ది థియరీ ఆఫ్ మోరల్ సెంటిమెంట్స్" (The theory of moral sentiments) అనే గ్రంథంలో ఈ మానవ శ్రేయోదాయకమైన ప్రకృతి, భగవత్సంబంధమైనదని పేర్కొన్నారు. నిగూఢమైన ఈ దైవశక్తి మానవ వ్యవహారాలన్నింటిని సహజంగా నడిపింపచేసి, కడకు మానవ కల్యాణానికి తోడ్పడుతుందని పేర్కొన్నారు. కాని తరువాతి గ్రంథమైన "జాతి సంపత్తి తత్త్వ కారణ పరిశీలనం" లో ప్రకృతి, భగవత్సంబంధమైనదని పేర్కొనలేదు. ఈ గ్రంథంలో వర్ణించిన ప్రకృతి తత్త్వం సంపూర్ణంగా లోపరహితమైనది కాదు దానిలోకూడా కొన్ని లోటుపాట్లుంటాయి కాని ఈ ప్రకృతిశక్తి మానవ శ్రేయోదాయకమైనదే.

విమర్శకులు చాలమంది ప్రకృతిసిద్ధాంతానికి అంగీకారం తెలిపారు కాని ఆ ప్రకృతి మానవ శ్రేయోదాయకమై తీరాలి - అన్న స్మిత్ ఆశావాదంలో పాల్గొనలేరు. అన్ని వ్యవహారాలు అతి సహజంగానే జరిగినప్పటికీ అవి కడకు మానవ శ్రేయస్సుకు దోహదం కాకపోవచ్చు. స్మిత్ ఆశావాదం ఆధార రహితమైనది. కేవలం కొన్ని పరిశీలనల ఫలితంమాత్రమే అది.

ప్రకృతి సిద్ధాంత నిరూపణకు ఏడమ్‌స్మిత్ చాల దృష్టాంతాలను పేర్కొన్నాడు. ఆయన అంతగా వర్ణించిన కృషివిభజన విధానం అటువంటిదే. కృషి విభజన విధానం ఉత్పత్తి తక్కువ వ్యయంతో తక్కువ కాలంలో అధికం చేయడానికి ఉద్దేశింపబడింది. ఈ ఉత్పత్తి మారకం (Exchange) కొరకు తయారు చేస్తారు. ఈ మారకంవలన వచ్చే ధనంతో తమ కోరికలను తీర్చుకుంటారు. కోరికలు కలగడం, వానిని తీర్చుకోవడం మానవప్రకృతి సహజము అటే మానవ ప్రకృతి సంజనితమే ఈ ఆర్థిక చైతన్యం, తత్సంబంధమైన కృషి విభజన విధానమూను. కాబట్టే అది సహజమైనది. రెండవ ఉదాహరణగా మానవ ఆర్థికపురోభివృద్ధికి అత్యంత ఉపకారియైన మూలధనపు స్వభావము పరిశీలించారు - మానవుడు తనకు సహజంగా ఆవిర్భవించే కోరికలను తీర్చుకొనుటకు సాధనభూతమైన మారకపు విధానానికి సాఫల్యం చేకూర్చేందుకు ఇదికూడా మానవ ప్రకృతి జన్యమైనదే. అటువంటిదే పెట్టుబడి ధనం (Capital). వస్తువుల గిరాకీ (Demand) సరఫరా (Supply) లను పరిశీలించి, అవి ఎంత సహజంగా ఆవిర్భవించి, కడకు నిరంతరం సమస్థితిలో నెలకొంటాయో విశదంగా తెలిపాడు ఏడమ్‌స్మిత్. ఒక ధరవద్ద సరఫరాకన్న గిరాకీ ఎక్కువైనప్పుడు, సరఫరాదారులు ఇతర వ్యాపకాలనుండి పెట్టుబడిధనాన్ని ఆ వస్తువులను ఉత్పత్తి చేయడంలో వినియోగించి గిరాకీవలని లాభాన్ని పొందడానికి తహతహలాడుతారు అప్పుడు సరఫరా ఎక్కువ కావడంవలన, గిరాకీ అలాగే ఉండడంవలన ధర తగ్గుతుంది. దానితో సరఫరా గిరాకీకి సమమై నిశ్చితమైన సమస్థితి ఏర్పడుతుంది. ఇదంతా స్వలాభాన్నపేక్షించే మానవప్రకృతికృతమే.

మానవప్రకృతి స్వలాభాపేక్షద్వారా వ్యక్తమౌతుంది ఈ స్వలాభాపేక్ష తాత్కాలికంగా గర్హ్యమైనప్పటికీ, ఏడమ్‌స్మిత్ ఆర్థికశాస్త్రరీత్యా అభిలషణీయమైనదని నమ్ముతాడు. మానవునికి సహజ

మైనది స్వలాభాపేక్ష. సహజమైనది కనుక అది సంఘక్షేమానికి దారితీస్తుంది. తన్ను తాను ఆర్థికంగా అభ్యున్నతి దశలోనికి పురోగమించ డానికి కృషిచేసి, అది అభిలషణీయమైనదే. ప్రతి వ్యక్తి ఆ విధంగా స్వోన్నతికై కృషిచేస్తే అది సహజంగా సంఘ శ్రేయస్సు కలిగి తీరుతుంది. సంఘ మంటే మానవులే కనుక సంఘంలోని ప్రతి మానవుడు ఉన్నతికొరకు కృషి చేసినట్లయితే సంఘం ఉన్నతికి పురోగమిస్తుంది. వారి కృషికి ఏవిధమైన అంతరాయం కలుగకూడదు. ఈ విధమైన వ్యక్తిస్వాతంత్ర్య తత్వాన్ని (Individualism) చాలామంది విమర్శించారు. వ్యక్తిగత స్వలాభాపేక్షాపరుల పురోగమనపథానికి అడ్డు తగలవద్దనేది ప్రధానమైన విమర్శ.

వస్తువుల విలువలను నిర్ణయించే సిద్ధాంతానికై (Theory of Value) ఏడమ్‌స్మిత్ చాలా కృషి చేశాడు. ఆయన సిద్ధాంతం కొంతవరకు అస్పష్టం గాను, అశాస్త్రీయంగాను ఉన్నమాట నిజమే అయినా, తరువాతి అర్థశాస్త్రజ్ఞుల విస్తృత శాస్త్రీయ సిద్ధాంతాలకిది మార్గదర్శి అయింది. విలువ అనేది (Value) రెండు విధాలుగా ఉంటుంది. ఒకటి: మారకం విలువ (Value in Exchange). రెండవది: ఉపయోగకరమైనది (Value in Use). కేవలం ఉపయోగకరత్వ వస్తువులకు మారకపు విలువ ఉండదు. ఉదాహరణకు గాలికి చాలా ఉపయోగకరమైన విలువ ఉంది. కాని మారకపు విలువ లేదు. అందువలన దానికి అర్థశాస్త్రరీత్యా ఏవిధమైన విలువా లేదు. కాబట్టి ఏడమ్‌స్మిత్ ప్రధానంగా మారకపు విలువనే పరిశీలించాడు. దీనిపై ఆయన వెలువరించిన భావాలను రెండు విభిన్న సిద్ధాంతాలుగా విభజించవచ్చు. ఒకటి నిక్షిప్త శ్రమ పరిమాణసిద్ధాంతం (Embodied Labour Theory) రెండవది: విహిత శ్రమ పరిమాణ సిద్ధాంతం (Commanded Labour Theory). బజారులో ఆ వస్తువు పలికే ధరఅన్నమాట. మొదటి దాని ప్రకారం ఒక వస్తువు యథార్థపు విలువ (అంటే కృషి పరిమాణంలో- (Real Value) ఆ వస్తువును తయారుచేయుటలో వ్యయమైన శ్రమ పరిమాణానికి సమానమవుతుంది. శ్రమ లేక కృషి పరిమాణాన్ని సాధారణంగా గంటలలో కొలుస్తారు. అంటే ఈ సిద్ధాంతం ప్రకారం ఒక వస్తువు తయారుకావడానికి పాటుపడే గంటల (ఒక మనిషి) శ్రమలేక కృషి వ్యయమైతే ఆ వస్తువు యథార్థపు విలువ పాటుపడిన గంటల కృషికి సమమవుతుంది. రెండవ సిద్ధాంతం ప్రకారం ఒక వస్తువు విలువ ఆ వస్తువును బజారులో విక్రయిస్తే వచ్చే కృషిపరిమాణానికి సమమవుతుంది.

మానవ నాగరికత ప్రథమదశలో అంటే పెట్టుబడి ధనము (Capital) వర్ధిల్లకపోయేకాలం అంతగా అభివృద్ధి చెందని కాలంలో నిక్షిప్త కృషి పరిమాణ సిద్ధాంతం వర్తించేదని స్మిత్ అభిప్రాయం. అనాడు వస్తు వినిమయ విధానం (Barter) అమలులో ఉండడంవలన, పెట్టుబడిపై లాభం ఉద్దేశింపబడనందున నిక్షిప్త శ్రమ సిద్ధాంతం వర్తించేది. కాని కాలక్రమాన పెట్టుబడివిధానం వృద్ధిచెంది ధన నిర్వహణం పురోగమించడం వలన, మానవుడు తాను పెట్టిన పెట్టుబడిపై లాభాన్ని కాంక్షిస్తాడు. కాబట్టి తాను ఒక వస్తువుపై వ్యయపరచిన శ్రమపరిమాణంకన్న ఆ వస్తువును అమ్మగా వచ్చే శ్రమపరిమాణం ఎక్కువ అయితే కాని విక్రయం జరపడు. ఈ అభిప్రాయాన్ని తరువాతి ప్రముఖ ఆర్థికవేత్త అయిన రికార్డో ఖండించాడు. రికార్డో సిద్ధాంతం ప్రకారం అన్ని కాలాలలోను నిక్షిప్త శ్రమ సిద్ధాంతమే సరియైనది. రికార్డో సిద్ధాంతానికి సంపూర్ణంగా వ్యతిరేకమైనది ఆయన సమకాలికుడు, జనాభా సిద్ధాంత రచనద్వారా (Population Theory) అత్యంత సుప్రసిద్ధుడు అయిన మాల్థస్ సిద్ధాంతం. ఆయన సంపూర్ణంగా ఏడమ్‌స్మిత్ అడుగు జాడల్లో నడిచాడు.

ఈ విధంగా ఏడమ్‌స్మిత్ మారకపు విలువ సిద్ధాంతం కొంతవరకు అస్పష్టం, అశాస్త్రీయం అయినప్పటికి తరువాతి రచయితలకు మార్గదర్శకం అయింది.

జాతీయ సంపత్తి పంపిణీ సిద్ధాంతాలపై ఏడమ్‌స్మిత్ కృషి ప్రశంసనీయమైనది. జాతీయోత్పత్తి పంపిణీ (Distribution of National Producc) మూడు విభాగాలుగా జరుగుతుంది. ఒకటి: పెట్టుబడిదారుల కిచ్చబడిన లాభద్రవ్యం (Profits), రెండు జీతభాలు (కార్మికులకు, Wages) మూడు: భూస్వాములకిచ్చేటి అద్దె (Rent) కార్మికులలో తక్కువ తరగతులవారికన్న జనాభా పెరుగుదల కూడా అధికంగా ఉంటుంది. అందువలన జీతాలు ఎక్కువ అయినకొద్దీ ఈ పెరుగుదల అధికమౌతుంది. అంటే,

కార్మికుల సరఫరా (Supply of Labour) గిరాకీ కన్న (Demand for Labour) హెచ్చుతుంది. దానితో వేతనప్రమాణం తగ్గిపోతుంది. ఈ వేతనం, కనీసపు వేతనంకన్న తగ్గినపుడు (Wage at the Subsistence level) కార్మికుల జనాభాతగ్గి కార్మికుల సరఫరా గిరాకీకన్న తగ్గి వేతనం హెచ్చవుతుంది. ఈ విధంగా కార్మికులవేతనం సరఫరా, గిరాకీలవల్ల నిర్ణీతమవుతుంది.

పెట్టుబడిదారీ విధానాన్ని సంపూర్ణంగా సమర్థింపదలచి వేతన సిద్ధాంతరచనలో, ఒక అడుగు సామ్యవాదంలోనికి వేశాడు, ఉదారహృదయుడైన ఆ అర్థశాస్త్ర పితామహుడు. కనీసపు వేతనాన్ని నిర్ణయిస్తూ, కేవలం చనిపోకుండా బ్రతికేందుకే గాక ఇంకొంచెం జీవనప్రమాణానికి తగిన వేతనం ఇవ్వాలని ఆయన అంటాడు. సాధారణంగా ఉత్పత్తిదారులు అనుకోకుండా కలుసుకొన్నప్పటికి, వేతనాన్ని తగ్గించి, తమ లాభాలను పెంపొందించుకునేందుకు ఉపాయాలను ఆలోచిస్తారట. ఉత్పత్తిదారులకు అత్యధికమైన బేరపుశక్తి ఉంటుంది. బీదవారగు కార్మికులట్టి సంఘటితశక్తిని పెంపొందింపచేసికొనలేరు.

లాభాలనుగురించి ప్రస్తావిస్తూ దేశ పురోగమనంతో పెట్టుబడి ధనాభివృద్ధి సాగుతూన్నకొద్దీ లాభాలు తగ్గుతూంటాయన్నాడు. పెట్టుబడి పెరుగుతూన్నకొలది, ఉత్పత్తిదారులమధ్య స్పర్థ వృద్ధిపొంది, ధరలుతగ్గి, వేతనాలు హెచ్చి లాభాలు తగ్గుతాయని స్మిత్ వాదం. అద్దె కష్టపడకుండా వచ్చే ఒక విధమైన ఆదాయమని స్మిత్ అభిప్రాయం. జాతీయాదాయం అత్యధికమైనపుడు అద్దెకూడా అధికమౌతుంది.

స్వేచ్ఛా వ్యాపారవ్యవస్థ, (Free enterprise) ఆర్థిక స్వాతంత్ర్యాలకై (Economic Liberty) స్మిత్ ప్రతిపాదించిన వాదం అతిప్రసిద్ధమైనది. ఆర్థికరంగంలో ప్రభుత్వ ప్రమేయం చాలా స్వల్పంగా ఉండాలని ఆయన వాదించి, తన అనంతరం రాబోయే ప్రసిద్ధ ఆర్థిక వేత్తల తత్త్వానికి పునాది వేశాడు. ఆర్థిక రంగంలో స్వేచ్ఛ కావాలన్న వాదం, ఆయన ప్రకృతి సిద్ధాంతానికి అనుగుణమైనది. ప్రకృతి అన్ని వ్యవహారాలను అతి సహజంగా, శ్రేయోదాయకంగా సాగిస్తుంది. ఎట్టి బహిరంగపు జోక్యమైనా అసహజమై, శ్రేయస్సును చెడగొట్టి ఆర్థిక రంగంలో కృత్రిమతను, అసౌలభ్యాన్ని రూపొందించుతుంది. ఏ విధమయిన జోక్యం లేనపుడు, ఆర్థికరంగం అతి సహజంగా మానవ శ్రేయస్సువంక పురోగమిస్తుంది. అపుడు పరస్పర స్పర్థవలన ఉత్పత్తిదారులంతా అతి చౌకగాను, మేలుగాను సరకులను తయారించి, ప్రజలకందిస్తారు. ఈ విధంగాకాక ప్రభుత్వం లేనిపోని కృత్రిమమైన జోక్యం కలిగించుకుంటే, అటువంటి స్పర్థపోయి, ప్రభుత్వ సాహాయ్యం పొందిన కొందరు ఉత్పత్తిదారులు కేవలం స్వలాభాపేక్షకు వశులైపోతారు. ఈ విధంగా ప్రభుత్వ ప్రమేయం, ప్రత్యేకంగా ఆర్థిక రంగంలో ప్రభుత్వప్రమేయం, అసహజమైనది, అనవసరమైనది, కాక శ్రేయస్సు నశింపచేసేది కూడ.

దేశ పరిపాలకునికి, ఉత్పత్తిదారునకు ఏ విషయంలోను కూడా పొసగదు. స్వేచ్ఛా వ్యాపార వ్యవస్థలో, పోటీ ఉంటుంది కనుక ఉత్పత్తిదారుడు అతి జాగరూకతతో మెలగి, స్వలాభాపేక్ష ఉంటుంది కనుక ఏ విధమైన నష్టం రాకుండా చూచుకొని, తన పెట్టుబడిని అధిక ఫలోన్ముఖంగా చేసుకుంటాడు. పరిపాలకుడు బహుకార్య నిమగ్నుడవడంవలన, అది తన స్వంత పనికాకపోవడంవలన ఉత్పత్తి కార్యక్రమంలో అంత శ్రద్ధ చూపకపోవడంవలన ఆర్థిక జగత్తు కష్టనష్టాలకు గురి అవుతుంది. స్వేచ్ఛా వ్యవస్థలో స్వలాభాపేక్ష అయిన ఉత్పత్తిదారు చాల పొదుపుగా ఉత్పత్తి సాగించి, అతి చౌకగా వస్తువిక్రయం చేయడానికి కృషి చేస్తాడు. అట్టి పొదుపును ప్రభుత్వం ఎప్పటికీ చేయలేదు. తమ ధనం కాకపోవడం వలన ఎంతటి జాగరూకులైన పరిపాలకులైనా అతి దుబారాగా ఖర్చు చేస్తారు.

అయినప్పటికీ, ఆర్థిక రంగంలో ప్రభుత్వానికి పూర్తిగా స్థానం లేదనడానికి వీల్లేదు. సామాన్యవ్యక్తులు నిర్వహింపలేని, సాంఘిక శ్రేయోదాయకాలైన కొన్ని కార్యాలను నిర్వహించడం, ప్రభుత్వం విధి. కొన్ని రోజుల స్పర్థవలన కొందరు ఉత్పత్తిదారులు క్రమంగా బలవంతులై గుత్తదారులై స్వేచ్ఛావ్యాపార వ్యవస్థకే ముప్పుతీసుకొని రావచ్చు. అట్టి సమయాలలో ప్రభుత్వప్రమేయంవలన ఆ ముప్పును తొలగింపవచ్చును. కొన్ని సమయాలలో ఈ పోటీవలన ఆర్థిక రంగానికి నష్టం సంభవింపవచ్చును. ఉదాహరణకు: రైలుమార్గాల నిర్వహణ, టెలిఫోను నిర్వహణ మొదలైనవి. అట్టివి ప్రభుత్వమే నిర్వహించాలి. ఇవి కాక, వ్యక్తిగతంగా నిర్వహించడానికి అసాధ్యాలైన, సైన్యం రక్షణ, ప్రజారోగ్యం, న్యాయశాఖ మొదలైనవి ప్రభుత్వపు విధులే.

ఈ విధమైన స్వేచ్ఛావ్యాపార వ్యవస్థ అంతర్జాతీయ రంగంలో కూడా ఉండాలని ఏడమ్‌స్మిత్

వారించాడు. వివిధ దేశాల నడుమ ఏ ప్రభుత్వ సంబంధమైన అడ్డంకులు లేనప్పుడు, ఆయా దేశాల ఉత్పత్తిదారుల నడుమ పోటీ హెచ్చి, అతి సమర్థులైన పోటీదారు ఉత్పత్తిచేసే మేలురకపు వస్తువులు అతి చౌకగా అన్ని దేశాలవారికీ లభ్యమౌతాయి. అంతేకాక, వివిధ దేశాలనడుమ ఈ విధమైన స్వేచ్ఛా వర్తక వ్యాపారాలు ప్రబలి ఉండడంవలన అంతర్జాతీయంగా శ్రమ విభజన విధానాన్ని ఉపయోగించుకోవచ్చును. ఏ దేశ పరిస్థితుల కనువైన ఉత్పత్తిలో ఆదేశం ప్రత్యేకతతో పరిశ్రమించి, మిగులును ఇతర దేశాలకు విక్రయించి, బదులుగా తనకు కావలసిన వస్తు సంచయాన్ని దిగుమతి చేసికోవచ్చును. ఈ విధంగా పెక్కు దేశాల నడుమ శాంతి సహకారాలను ఆర్థికరంగంలో సాధింపవచ్చును.

దిగుమతి వస్తువులపై రక్షణ సుంకాలను (Protective Tariff) ఏడమ్‌స్మిత్ తీవ్రంగా నిరసించాడు. అటి రక్షణసుంకాలు వర్తక వ్యాపారాలలో అవాంఛనీయమైన, పరస్పర వైషమ్యాలను కలిగించి శ్రమవిభజన విధానానికి గొడ్డలిపెట్టై సర్వ విధాల నష్టకరమౌతాయి. అంతేకాక మనదేశపు సరకులకన్న విదేశీయ వస్తువులు చౌకగా లభ్యమౌతూన్నప్పుడు ఈరక్షణ సుంకాలను హెచ్చించి, ఆదేశపు సరుకులను నిషేధించడం కేవలం అవివేకం—అని స్మిత్ అభిప్రాయం. స్వేచ్ఛా వ్యాపారవ్యవస్థ ననుసరించి ప్రతిదేశం తన పరిస్థితుల కనువైన ఒక పరిశ్రమలో ప్రత్యేక శ్రద్ధతో కృషిచేసి ఇతరవస్తు సంచయాన్ని చౌకగా ఉత్పత్తిచేయడం శ్రేయస్కరం. కాని పరస్పర వైషమ్యాలతో అనుమానాలతో సతమతమౌతూన్న ఆధునిక అంతర్జాతీయార్థికరంగంలో ఏడమ్‌స్మిత్ ఆశావాదానికి తావులేదు.

ఈ విధంగా స్మిత్ సిద్ధాంత పరిశీలన చేసిన వెనుక, ఆయన తనపూర్వుల సిద్ధాంతాలతో ఏవిధంగా వ్యతిరేకించాడో తిలకిస్తే, ఆయన ప్రతిభావ్యుత్పత్తులు సువ్యక్తమౌతాయి.

మొదటిది: స్మిత్ గ్రంథంలో ఆయన వాణిజ్య (విధాన) వాదుల (Mercantalists) పై జరిపిన అప్రతిహతమైన విమర్శనం. ఆయన వాదంతో వాణిజ్య వ్యవస్థపై ప్రజలకు సంపూర్ణంగా విశ్వాసం తొలగి, దానిపై ద్వేషభావం కలిగింది. వాణిజ్య వాదానికి ఏకోపా ఖండంలో స్థానం లేకుండాచేసి, దానిని రూపుమాపినది ఆయన ఒనరించిన అజేయమైన, అఖండ తర్క సంపన్నమైన తీవ్ర విమర్శనమే. ఎగుమతులను మాత్రమే సంపూర్ణంగా పెంపొందింపచేసి, దిగుమతులను పూర్తిగా తగ్గించి, వివిధ విదేశాలనుండి బంగారాన్ని రాబట్టేందుకు, అత్యధికమైన రక్షణ సుంకాలను విధించాలన్నవారి వాదానికి ఈ ఆర్థిక స్వేచ్ఛావాదం గొడ్డలిపెట్టు. అన్ని దేశాలవారు అధికంగా వ్యవహరిస్తే అసలు దిగుమతి చేసుకునే దేశమే ఉండదనీ, ఒక పరిశ్రమలో ప్రత్యేకత సంపాదించేందుకు అవకాశం ఉండదని స్మిత్ వాదించి, తన అజేయతర్క ప్రతిభను, వారి తర్క నైరాశ్యాన్ని నిరూపించాడు. దేశంలో ఉత్పత్తిని పెంచడం జాతిసంపత్తిని ఇనుమడింపజేస్తుంది కాని కేవలం రక్షణ సుంకాలను అధికంచేసి చౌకగా లభ్యమయ్యే విదేశీ సరకులను అరికట్టి విపరీతమైన ధరలకు దేశీయమైన వాడకపు సరుకును అభివృద్ధి చేయడంవలన కాదని వాదించాడాయన.

మూలదృష్టిలో ఫిజియాక్రట్లకు (భూమి ప్రాధాన్య వాదులకు) ఏడమ్‌స్మిత్‌కు నడుమ అత్యధిక సాన్నిహిత్యం అగపడినా, సూక్ష్మ పరిశీలనపై స్మిత్ సిద్ధాంతాలు వారికంటె ఎంతగా ప్రతిభావంతమైనవో గోచరమవుతుంది. వ్యవసాయానికి మాత్రమే జాతీయాదాయ కారకంగా అత్యధిక ప్రాధాన్య మిచ్చిన వారి సంకుచిత దృష్టిని తీవ్రంగా విమర్శించాడు స్మిత్. స్మిత్ ప్రతిపాదించిన ప్రకృతి సిద్ధాంతం, వారిసిద్ధాంతానికి అన్నివిధాలా వేయి మడుగులు ప్రతిభావంతమైనది. ప్రకృతి వారి సంకుచిత దృష్టిలో ఏదో ఒక అస్పష్టమైన ఆదర్శం మాత్రమే. కాని స్మిత్ భావనలో అది నిత్యవ్యవహారాలలో నిమగ్నమయిన వాస్తవికత. ఇవేకాక ఫిజియాక్రట పన్నుల విధానం స్మిత్ పన్నుల సిద్ధాంతాల ముందు వెలవెలబోతుంది. ఆయన ప్రతిపాదించిన ప్రపంచ ప్రసిద్ధమైన 'పన్నుల సూత్రాలు' అజేయమైనవి.

* * * *

నన్నయభట్టారకుడు తెలుగులో ఆదికవీంద్రుడు. అంటే ఆయనకు ముందు తెనుగుపద్యాలు లేవని కాదు. సర్వాంగసుందరమూ, సర్వలక్షణ లక్షితమూ, సరసోపేతమూ అయిన మహాకావ్యం తెనుగులో అంతకు ముందు సృష్టింపబడలేదు. అందుకే ఆయన ఆదికవీంద్రుడు. ఏడమ్‌స్మిత్‌కు ముందు అర్థశాస్త్ర జగతి లేనే లేకపోలేదు. కాని దానిలో ప్రాణప్రతిష్ఠ చేసిన పితామహుడాయన. అంతకు ముందది నిర్జీవమైనది. అంతకు ముందు ఆయన గ్రంథమంటి శాస్త్రీయమైన ప్రతిభావంతమైన గ్రంథం లేదు. అర్థశాస్త్ర జగతిలో ఆయన నిస్సంశయంగా పితామహుడు. ఆయన సృష్టి నిరంతరాయంగా వృద్ధిపొందుతూనే ఉంది.

# ఎవరో పిలిచారు!

శ్రీ అంగర సూర్యారావు

పాత్రలు:

| | |
|---|---|
| రఘుపతి | జగన్నాథం |
| శ్యామసుందరం | రవిమూర్తి |
| చంద్రయ్య | యమున |

* * (రంగస్థలాన్ని చీకట్లు ఆవరించి వున్నాయి. కన్ను పొడుచుకున్నా కనిపించని గాఢాంధకారం. దూరాన్నుంచి—కొండ గుహలోంచి పిలుస్తున్నట్లు "రఘుపతీ! రఘుపతీ!" అని పిలుపు వినిపించి ఆగిపోయింది. వెంటనే రంగస్థలం మీదికి నీలికాంతి ప్రసరిస్తుంది. మసక వెలుగులో అందమైనగది కనిపిస్తుంది. గది మధ్యద్వారం తెరుచుకొని రఘుపతి వస్తూ వుంటాడు. గదిలో కుడివైపు ఒక సోఫా. ఎడమవైపు ఒక రౌండు టేబులు ఒక కుర్చీ వున్నాయి.)

రఘుపతి: (కసిగా) ఎవరది? ఎవరు?

(కుడి చివరకు వెళతాడు. జగన్నాథం ఎడమవైపునుంచి ప్రవేశిస్తాడు. చేతులతో తడుముకుంటూ ముందుకు వస్తాడు. రెండు కళ్ళూ లేవు. పొడవైన జుట్టు - మాసిన గడ్డం - ముఖంలో ప్రశాంతత కనిపిస్తూ వుంది).

జగన్నాథం: ఏమిటి నాయనా?

రఘు: (ముందుకు చూస్తూ) ఎవరో పిలిచినట్లయ్యింది.

జగ: నువ్వు కలవరిస్తున్నావు నాయనా.

రఘు: (వెనక్కి తిరిగి) లేదు. నేను స్పష్టంగా విన్నాను.

జగ: నీ మనసుకు శాంతి లేదు. డబ్బుతో శాంతిని కొనలేవు. ఇప్పటికైనా మించిపోయింది లేదు. నా మాట విను.

రఘు (విసుగా) గదిలోంచి కదలొద్దని ఎంత చెప్పినా వినవు. పడిపోతావు. నీకేం కావాలిసినా నీ దగ్గరకే వస్తాయి. వెళ్ళిపో తాతయ్యా!

జగ: నేను పడిపోను నాయనా! నీకా భయం అక్కర్లేదు. కళ్ళులేనివాడెప్పుడూ జాగ్రత్తగానే వుంటాడు. కళ్ళున్నవాడే—చూస్తూ చూస్తూ గోతిలో పడతాడు.

రఘు: (కోపంతో) తాతయ్యా!

జగ: అవున్నాయనా. నిజమే చెబుతున్నాను. కట్టుకున్న ఆడదాన్ని కాళ్ళతో తన్ని పారేశావు. పాపం! విమల......

రఘు: (కోపంలో అందుకొని) ఆ మాట నా దగ్గర ఎత్తకు.

జగ: వ్యామోహంలో పడిపోతున్నావు. డబ్బు, కీర్తి, అహంకారం మనిషి పతనానికి మరింత తోడ్పడతాయి.

రఘు: నీ ధర్మబోధ మరోసారి యెప్పుడైనా చేద్దువుగాని ప్రస్తుతానికి నన్ను విడిచిపెట్టు.

జగ: వెళతాను. నాయనా వెళ్తాను. దూరాన్నుంచి మెరిసే ప్రతి వస్తువూ అందమైనదని భ్రమించకు.

రఘు: (హేళనగా) అందాన్ని గురించి నువ్వు మాట్లాడకు తాతయ్యా.

జగ: నేను గుడ్డివాణ్ణి. అందం గురించి మాట్లాడకూడదు. నిజమే. కాని ఒక్క మాట అడుగుతాను. కళ్ళున్న ప్రతిమనిషికీ యీ ప్రపంచం ఒకలాగే కనిపిస్తోందా?

రఘు: ఎందుకు కనిపించదు?

జగ: ఒకడికి యీ ప్రపంచం స్వర్గంలా కనిపిస్తుంది.

రఘు: అది నిజమే.

జగ: నిజం కాదు. భ్రమ!—మరొకడికి యీ ప్రపంచం మూడుకోణాల్లో కూలిపోయే కొంపలా కనిపిస్తుంది.—ఉద్యానవనాలు, సముద్రతీరం, నీలాకాశం, చుక్కల మధ్య వెన్నెల చందమామ—కవికి యీ ప్రపంచం అందమైన బొమ్మలా కనిపిస్తుంది. దరిద్రుడికి ప్రతి అందమైన వస్తువు, ప్రతి విలువైన వస్తువు తన్ను చూసి వెక్కిరిస్తు

రఘు: (జాలిగ్గా) ఓహో! అదా నీ అనుమానం. నా స్నేహితుడు తన భార్యతో నన్ను చూడ్డానికి వచ్చాడు.

జగ: (సూటిగా) రెండ్రోజుల క్రితం వచ్చాడు. అంతేనా?

రఘు: (చకితుడై) ఏమిటి తాతయ్యా! నువ్వంటున్నది!

జగ: నువ్వు యీ గుడ్డివాణ్ణి మోసం చెయ్యలేవు నాయనా! నాకు అంతా తెలుసు—చిలుకను నువ్వు బంగరు జామపళ్ళు చూపించి నెమ్మదిగా పంజరంలోకి తీసుకు వచ్చావు.

రఘు: (కోపంతో) నువ్వు నా సొంత విషయాలలో కలగచేసుకోవద్దు.

జగ: (నిట్టూర్చి) పెద్దవాణ్ణి కనక—యింకా బతికి వున్నాను కనక - చెబుతున్నాను. వృధాగా చెడిపోవద్దంటున్నాను. మంచి దారిలో నడవ మంటున్నాను.

రఘు: నా కోరికల్ని, ఆనందాన్ని చంపుకోని పిచ్చివాణ్ణి కాలేను.

జగ: నీ స్వార్థం కోసం, నీ కోరికల కోసం యితరులను మోసం చెయ్యడం న్యాయమా?

రఘు: న్యాయాన్యాయాలను చర్చిస్తూ కూర్చోడానికి నాకు తీరిక లేదు.

జగ: న్యాయాన్ని, అన్యాయాన్ని పరిశీలించేందుకు మన తలపై ఒక ఉన్నత న్యాయస్థానం వుంది. అది యెప్పుడూ నిన్ను కనిపెడుతూ వుంటుంది. మెరుపులా మెరిసి మాయమయ్యే యౌవనంలో - క్షణికమైన యౌవనంలో—చేసిన పాపాలకు ఒక న్యాయమూర్తి సమక్షంలో తలవంచి నిలబడవలసి వస్తుంది.

రఘు: (కోపంతో) తాతయ్యా!

జగ: అవును మంచి మాట—రోగాన్ని పోగొట్టే మందులా—చేదుగా వుంటుంది—నాయనా! నా జంటను యెందుకు చీలదీశావు? ఆమెను యిక్కడికి యెందుకు తీసుకు వచ్చావు?

రఘు: ఇందులో మోసం, ద్రోహం యేమీ లేవు. మేం యిద్దరం యిష్టపడ్డాం. సత్యప్రమాణంగా చెబుతున్నాను. ఆమెను నేను ప్రేమించాను.

జగ: ప్రేమ కాదది. వ్యామోహం!—చిన్న కుర్రాడు అందమైన ఆటవస్తువును చూసి ముందుకు వురుకుతాడు. చేతికి అందిన తరవాత ఒక రోజంతా దానితో ఆడుకుంటాడు. తరవాత దాన్ని దూర పారేస్తాడు. అది కేవలం వ్యామోహం నాయనా.

రఘు: (తీక్షణంగా) తాతయ్యా! నీ బాధ పడలేక నేను యిక యిల్లు విడిచి పెట్టి పోవలసి వుంటుంది.

జగ: నువ్వు యిల్లు విడిచిపెట్టిపోవడం దేనికు బాబూ! నేను యీ లోకమే విడిచి పెట్టిపోయే రోజులు దగ్గరకు వస్తున్నాయి.

రఘు: నా స్వంత విషయాలలో నువ్వు కలగచేసుకోవద్దు.

జగ: నాయనా! ఒకమాట అడుగుతాను—ఒక వ్యక్తి నీమనసుకు కష్టం కలిగిస్తే నువ్వు సహించగలవా?

రఘు: (కోపంతో) యెంతమాత్రం సహించను.

జగ: అదేవిధంగా—యితరుల మనసుకు కష్టం కలిగే పని యేదీ నువ్వు చెయ్యకూడదు. మన పురాణాలు, ఇతిహాసాలు బోధించే పరమధర్మం యిదే.

రఘు: ధర్మబోధ వింటూ కూర్చునే కాలం నాకింకా రాలేదు. నా సరదాలు, కోరికలూ విడిచిపెట్టి సన్యసించి కూర్చోలేను.

జగ: నీ కోరికల కోసం యితరుల గుండెల్లో చిచ్చు పెట్టకు. అదే నిన్ను నేను కోరేది. నువ్వు పెళ్ళికానివాడివా అంటే అది కాదు. పాపం! విమలను తలుచుకుంటే గుండె చెరువై పోతుంది. ఆమె సంసార జీవితం మూడునాళ్ళ ముచ్చటగా ముగిసిపోయింది.

రఘు: (అసహనంతో బిగ్గరగా) వెళ్ళిపో తాతయ్యా! వెళ్ళిపో! యిక నేను వినలేను. ఊఁ! లోపలికి వెళ్ళిపో!

జగ: (వెళ్ళిపోతూ నిట్టూర్చి) నన్ను కరుణించు భగవాన్!

(ఎడమవైపు వెళ్ళిపోతాడు—గదిలోంచి యమున వస్తుంది. ఆమె ముఖంలో మార్పు కనిపిస్తుంది.)

యము: (సూటిగా) మీకు పెళ్లయ్యిందా?

రఘు: అవును.

యము: ఆ విషయం నాతో యెందుకు చెప్పలేదూ?

రఘు: చెప్పవలసిన అవసరం రాలేదు కనక.

యము: (శాంతగా) వెన్నెలా మోసం చేస్తుందం టావా మీరు!

రఘు: (గేలిగా) ఇందులో మోసం ఏమీ లేదు. ఆమె ప్రకృతికి వుండే ఇచ్చిందాని క్రింద లెక్క.

యము: అంటే?

రఘు: పాపం, విమల నేడో రేపో యీ ప్రపంచాన్ని విడిచిపెట్టడానికి సిద్ధంగా వుంది. (బాధగా) ఆ విషయం మరిచిపోవాలని ప్రయత్నిస్తున్నాను. కాని యెందుకో ఒకసారి జ్ఞాపకం చేసుకున్నాను. (నిట్టూర్చి) యమునా! వృధాగా మనసు పాడు చేసుకోకు. నీ దారికి యెవరూ అడ్డు లేరు.

యము: అది....(ఏదో చెప్పబోతుంది.)

రఘు: (మధ్యలో అందుకొని) దయచేసి ఆ మాట నా దగ్గర యెత్తకు. (రిస్టు వాచీ చూసి) నేను యిప్పుడు క్లబ్బుకు వెళ్ళిరావాలి.

యము: ఇవేళ నాకు ఆదోలావుంది. మీరు యెక్కడికీ వెళ్ళకండి.

రఘు: ఒక అరగంటలో తిరిగి వస్తాను.

యము: అంత అవసరమా?

రఘు: ఒక స్నేహితుణ్ణి కలుసుకుని మాట్లాడాలి. చాలా అవసరమైన పని.

యము: ఈ రోజుకు పని మానుకో లేరూ!

రఘు: ఎందుకు యమునా అంత భయపడుతున్నావు?

యము: ఇక్కడ ఎంతో ప్రశాంతంగా చక్కగా వుంది. అయినా...

రఘు: నీ నీడను చూసి నువ్వే భయపడుతున్నావు. (ఆమెను దగ్గరకు తీసుకుంటూ) నీ కళ్ళలో భయం యెంత అందంగా కనిపిస్తోంది!

యము: మన ప్రయాణం గురించి ఆలోచించారా?

రఘు: ఆలోచించడానికి యేముంది? వెళదాం. ఊహా ప్రపంచంలాంటి అందమైన చోట్లన్నీ చూద్దాం. మనసుఖం కోసం, సంతోషం కోసం డబ్బు వెదజల్లుదాం. ఒకే ఒక్క మాటలో చెప్పాలంటే నీకు యీ ప్రపంచంలో తీరని కోరిక అంటూ ఒక్కటీ వుండదు.

యము: మీరు ఐశ్వర్యం గురించి మాట్లాడుతూ వుంటే నాకు దరిద్రం జ్ఞాపకం వస్తూవుంటుంది.

రఘు: గడిచిపోయిన రోజుల గురించి ఆలోచించకు. అది ఒక పీడకల.

యము: ఇవతలి గట్టునుంచి చూస్తూవుంటే దరిద్రం ఎంత భయంకరంగా కనిపిస్తోంది! మా నాన్నను తలుచుకుంటే గుండెలు జలదరిస్తున్నాయి. దరిద్రం మనిషిని పశువుగా మారుస్తుంది కదూ!

రఘు: అదిక ముగిసిపోయింది. యిక కష్టాల నీడ కలలో కూడా కనిపించదు.

యము: ఆ ఆశతోనే అన్నీ విడిచిపెట్టి మీ చేతుల్లో చిక్కుకున్నాను. మీ మాటలకు పూర్తిగా లొంగిపోయాను. ఇక యేం చేస్తారో మీదే భారం!

రఘు: నువ్వేదో అనుమానంతో బాధపడుతున్నావు. మనసు విప్పి చెప్పు. నీ అనుమానాన్ని క్షణంలో తీరుస్తాను.

యము: ఉహుఁ! ఏం లేదు.

రఘు: (రెండు చేతులతోనూ ఆమె ముఖం పట్టుకొని కళ్లలోకి సూటిగా చూస్తూ) అబద్ధమాడకు.

యము: మీరు నన్ను...

నేపథ్యంలో (బిగ్గరగా) రఘుపతీ! రఘుపతీ!

యము: (భయంతో కెవ్వున అరిచి) హమ్మయ్యో! అతనే! అతనే! అతని పిలుపు నాకు బాగా తెలుసు!

రఘు: (తీక్షణంగా) ఈ యింటిలో నీకెవరూ అపకారం చెయ్యలేరు. ఇక్కడ భయం అన్న మాటకు చోటు లేదు. నిర్భయంగా నువ్వు లోపలికి పోయి కూర్చో (ఆమె యేదో చెప్పబోతుంది) ఇక మాట్లాడకు. వెళ్లిపో!

(యమున తొందరగా మధ్యద్వారంలోంచి వెళ్లిపోయి తలుపు వేసుకుంటుంది. కుడివైపునుంచి చంద్రయ్య వస్తాడు.)

చంద్ర: అతను మళ్ళీ వచ్చాడు.

రఘు: (కోపంతో) ఏమంటాడు?

చంద్ర: మీతో అర్జంటుగా మాట్లాడాలంట.

రఘు: (ఆలోచిస్తూ) ఈ పీడ యెలా వదిలించుకోవాలో తెలియకుండా వుంది. (కోపంతో) నా దారికి అడ్డువచ్చినవాణ్ణి నిర్దాక్షిణ్యంగా చిదిమేస్తాను. (తీక్షణంగా) వెళ్ళు! అతనిని లోపలికి పంపు.

(చంద్రయ్య కుడివైపు వెళ్లిపోతాడు. రఘుపతి ముఖంలో కోపం, అవమానం కనిపిస్తూ

శ్యాం: (వెంటనే అందుకొని) కావలసినంత వుంది. ఆమెతో నివసించి తెగ తెంపులు చేసుకోడానికే వచ్చాను

రఘు: (బిగ్గరగా నవ్వుతూ) వెర్రివాడా! ఆమెతో తెగ తెంపులు చేసుకోడానికి నా దగ్గరకు వచ్చావా? నా దగ్గరకు వస్తే ఏం ప్రయోజనం? ఆమె యెక్కడవుందో వెతికి......

శ్యాం: (వెంటనే అందుకొని) వెతుకుతోనే, జాడ తెలుసుకొనే మరీ వచ్చాను. ఒక్కసారి ఆమెను పిలు. నీ ముందే రెండుమాటలు అడిగి వెళ్ళిపోతాను.

రఘు: (తీక్షణంగా) నువ్వు భ్రమించి మాట్లాడుతున్నావ్ శ్యాం!

శ్యాం: యమున యిక్కడ లేదా?

రఘు: లేదు.

శ్యాం: ఆమెగురించి నీకేమీ తెలీదుగా?

రఘు: తెలీదు.

శ్యాం: (గదివైపు చూస్తూ) నేను యీ గదిలోకి వెళ్ళి చూడొచ్చా?

రఘు: (అతనిని చెయ్యిపట్టుకొని బలవంతంగా ఆపు చేసి) ఆగు! ముందుకు అడుగువేశావా! నీ ప్రాణాలు దక్కవు.

శ్యాం: (నిర్లక్ష్యంగా) ప్రాణాలకు తెగించే యిక్కడికి వచ్చాను. ఆమెను చూసితీరాలి ఏదో ఒకటి తేల్చుకోవాలి.

(వేగంగా మధ్యద్వారం దగ్గరకు పోతాడు.)

రఘు: (బిగ్గరగా) చంద్రయ్యా! (చంద్రయ్య వెంటనే వచ్చి నిలబడతాడు. శ్యామసుందర్ని చూపిస్తూ) వీణ్ణి బయటకు గెంటెయ్.

(చంద్రయ్య వెంటనే శ్యామసుందరం మెడపట్టి రెండు చేతులతోను అదిమిపట్టి తీసుకుపోతూ వుంటాడు.)

శ్యాం: (బిగ్గరగా) రఘుపతీ! రఘుపతీ! జ్ఞాపకం వుంచుకో! నీ పాపానికి ప్రతీకారం తప్పదు. నీ గుండెలో వ్రదవాశవాతే......

(చంద్రయ్య శ్యామసుందర్ని కోటగుమ్మానికి తీసుకుపోతాడు. నూతిలోంచి పిలిచినట్లు "రఘుపతీ! రఘుపతీ!" అన్న పిలుపు దూరమైపోతూ వుంటుంది.—యమున తలుపు తోసి గదిలోంచి ఒక అడుగు యివతలకు వేసుంది. జగన్నాథాన్ని చూడగానే లోపలికి వెళ్ళిపోతుంది).

జగ: (ఎకాయెకిగా కనిపించి) రఘుపతీ! ఎవరివా కేకలు! ఏమిటి ఆ అలజడి?

రఘు: ఏమీ లేదు తాతయ్యా!

జగ: పర స్త్రీ కోసం, పరాయి డబ్బు కోసం ఆశపడేవాడికి జీవితంలో శాంతివుండదు నాయనా! వాడి జీవిత మంతా అలజడి! అశాంతి! ఇప్పటికైనా తెలుసుకో.

రఘు: (కోపంతో బిగ్గరగా) తాతయ్యా!

జగ: నీకు జ్ఞానోదయం కలిగించమని నిత్యం భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. భగవంతుడు నా మొర వినడం లేదు. మానవుడు తను చేసిన కర్మకు పశ్చాత్తాపపడే రోజు వస్తుంది రాకపోదు.

(జగన్నాథం వెనక్కి వెళ్ళిపోతాడు. యమున గదిలోంచి వస్తుంది. ఆమె ముఖంలో విషాదం తాండవిస్తోంది)

యమున: (గద్గద స్వరంతో) నాకు యిన్ని కష్టాలు ఎదురవుతాయని నేను ఊహించలేక పోయాను.

రఘు: పొరపాటు పడుతున్నావు యమునా! ప్రతి చిన్న విషయానికీ నువ్వు కలవరపడుతున్నావు.

యమున: పాపం! శ్యాం! నా మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు.

రఘు: ఇక ఆమాట మరిచిపోవాలి నువ్వు.

యమున: అవును. మరిచిపోవాలి. నిజమే—అతను నన్ను ఎంతగా శపించుకుంటున్నాడో!

రఘు: ఇవేళ యిష్టమైన వస్తువు రేపు అయిష్టమౌతుంది. మనస్సు మారుతూవుండటం మానవ సహజం. ఇక ఆ విషయం నీ మనసులోంచి తుడిచెయ్. చూడూ—నాకు టైం కావస్తోంది పోయివస్తాను.

యమున: మీరు పైకెళతారా? నాకేదో భయంగా వుంది.

రఘు: నువ్వేమీ భయపడనక్కరలేదు. నిశ్చింతగా లోపలకూర్చో పదినిముషాలలో తిరిగివస్తాను.

చంద్ర: (వుడిబడిగా కనిపించి) రవి మూర్తిగారొచ్చారు

జగ: నా కూతురు వీడిని నా చేతుల్లో పెట్టి ప్రాణం విడిచి పెట్టింది. ఏ లోటూ లేకుండా పెంచి పెద్దవాణ్ణి చేశాను. చివరకు యిలా జారి పోయాడు. ఏం చెప్పను? అంతా నా ఖర్మ! (బిగ్గరగా దగ్గుతూ ఎడమవైపు వెళ్లిపోతాడు. రవిమూర్తి అతను వెళుతున్నవైపు చూస్తూ వుంటాడు. గది తలుపు తెరుచుకొని రఘుపతి వస్తాడు. అతని చేతిలో చిన్న తోలుపెట్టె వుంది.)

రఘు: చంద్రయ్యా!

చంద్ర: (కుడిచివర కనిపించి) కారు సిద్ధంగా వుందండి.

రఘు: (రవిమూర్తిని చూపిస్తూ) వీరిని తీసుకువెళ్ళి కారులో కూర్చోబెట్టు. నేను యిప్పుడే వస్తాను.

రవి: (భయంతో) ఎందుకూ?

రఘు: అబ్బే! ఏం లేదు. మీ యింటిదగ్గర విడిచి పెడతాం. ఈ చీకట్లో ఒక్కరూ యేం వెళ్తారు!

చంద్ర: పదండి.

(ముందు రవిమూర్తి వెనక చంద్రయ్య కుడివైపు నిష్క్రమిస్తారు. — యమున గదిలోంచి వస్తుంది. ఆమె చేతిలో పుస్తకం వుంది.)

యము: వెళుతున్నారా?

రఘు: ఇప్పుడే వస్తాను.

(రఘుపతి కుడివైపు వెళ్ళిపోతాడు. యమున సోఫాలో కూర్చుని పుస్తకం తెరుస్తుంది. పేజీలు తిప్పి తిరిగి పుస్తకం మూస్తుంది. లేచి నిలబడుతుంది. ఆమె ముఖంలో అశాంతి కనిపిస్తుంది. అటూ యిటూ తిరుగుతుంది. ప్రతి చిన్న ధ్వనికి ఉలిక్కిపడి చూస్తుంది. గదిలోకి వెళ్ళిపోయి తలుపు వేసుకుంటుంది. — ఎడమవైపునుంచి నెమ్మదిగా ఒక నీడ ముందుకు వస్తుంది. ముసుగులో ఆ వ్యక్తిముఖం కనిపించడంలేదు. అతను కుడి చివరకు వెళ్ళి వీధి తలుపు లోపల గడియ వేస్తాడు. తిరిగి మధ్యగదిదగ్గరకు వచ్చి తలుపు నెమ్మదిగా తట్టి — ఎడమవైపు క్రీనీడలోకి తప్పుకుంటాడు. తలుపు తెరుచుకొని యమున ఒక అడుగు ముందుకు వేస్తుంది. కుడివైపు చూస్తూవున్న సమయంలో వెనకనించి ఆ వ్యక్తి ఆమెను సమీపిస్తాడు. ఆకస్మికంగా ఒక చేత్తో ఆమెనోరు నొక్కుతాడు.)

వ్యక్తి: (కోపంతో) నన్ను తప్పించుకుపోదామను కున్నావా? (అతని ముసుగు తొలగిపోతుంది.)

యము: (అతని చెయ్యి విడిపించుకుని ఆశ్చర్యంతో) శ్యాం!!

శ్యాం: అవును చెలీ! నీ చేతిలో కీలుబొమ్మలా తిరిగి మోసపోయిన శ్యాం నేనే!

యము: నేను మోసం చేశా ననుకుంటున్నావా శ్యాం?

శ్యాం: ఇంకా యెంత తియ్యగా మాట్లాడుతున్నావు. నీ గుండెల్లో యింత విషం వుంటుందని నేను కలలోకూడా వూహించలేదు, నీ మాటలలో కపటం వుంటుందని నేను ఎన్నడూ అనుకోలేదు. చలువెన్నెల రాత్రిలో నీ కళ్లలోకి చూస్తూ — నాలో నిద్రపోతున్న కోరికలను తట్టి లేపుతూవుంటే — నాకీ ప్రపంచం ఒక రమ్యమైన స్వప్నసీమలా కనిపించింది. నిన్ను ఒక దేవతలా పూజించాను. మొలకలెత్తుతున్న నా ఆశలను, కోరికలనూ నిర్దాక్షిణ్యంగా నీ పాదాలతో తొక్కిదంపావు. నీలాంటి దుర్మార్గురాలిని......

యము: (కోపంతో) ఆగు! నా మనసు మార్చుకోడానికి నాకు హక్కు వుంది.

శ్యాం: నా జీవితాన్ని ధ్వంసం చెయ్యడానికి కూడా నీకు హక్కు వుందా?

యము: నేనొకమాట చెబుతాను. వింటావా?

శ్యాం: (హేళనగా) ఇంకా నీమాటలు వినమంటావా?

యము: నువ్వు నమ్మినా నమ్మకపోయినా ఒకమాట చెబుతాను. విను. నేను పొరబాటు చేశాను.

శ్యాం: అంటే?

యము: దూరాన్ని కనిపించే అందమైన బంగారు మేడను చూసి భ్రమించి — అడ్డదారిని దానిని సమీపించాను.

శ్యాం: నువ్వు దారితప్పిననమాట ఒప్పుకుంటున్నావా?

యము: (తన ధోరణిలో) లోపలికి వెళ్లాను. అంతా పరిశీలించి చూశాను. తిరిగి వద్దామని ఎంతో ప్రయత్నించాను. తలుపులుమూతబడిపోయాయి.

తలుపు తియ్యమని గొంతెత్తి పిలిచాను. నా పిలుపు యెవరూ వినిపించుకోలేదు. ఇక ఆ తలుపులు తెరవబడలేదు. నేను ఒకసారైనా మనసారా సంతోషించలేదంటే నమ్ముతావా శ్యాం?

శ్యాం: ఎంతమాత్రం నమ్మను (ఆమె ముఖంలోకి తీక్షణంగా చూస్తూ) నిన్ను చూస్తుంటే నాకు భయం వేస్తోంది.

యము: ఏం? ఎందుకు?

శ్యాం: నువ్వు చెప్పిన మాటలన్నీ నమ్మి రెండవసారి మోసపోతానని.

యము: (ఏడుస్తూ) శ్యాం!

శ్యాం: (కోపంతో) నోర్ముయ్. ఈ రోజుతో మన జీవితాలు ఆఖరు. ఇక సూర్యోదయాన్ని నువ్వు చూడలేవు.

యము: నేను చావుకు భయపడ్డంలేదు.

శ్యాం: మరి దేనికి భయపడుతున్నావ్?

యము: దేనికీ భయపడ్డంలేదు. మరొక మాటవిను. నేను యిప్పటికీ నిన్ను ప్రేమిస్తున్నాను.

శ్యాం: (హేళనగా నవ్వుతూ) హహ్హహ్హ! ప్రేమ! శరీరాన్ని అమ్ముకున్న నువ్వు ప్రేమనుగురించి మాట్లాడుతున్నావా?

యము: (బాధగా) నన్నిలా అవమానించే బదులు పొడిచి చంపకూడదూ!

శ్యాం: ఇక ఆలస్యం చెయ్యడానికి వీల్లేదు. నా పని నేను పూర్తిచేసుకోవాలి. నువ్వు దేనికోసం భ్రమించి-అంత విడిచిపెట్టినావో అక్కడే నిన్ను శాశ్వతంగా...

(ఆవేశంతో చేతిలోకత్తి పైకెత్తుతాడు.)

జగన్నాథం: (అకస్మాత్తుగా ఎడమ చివర కనిపించి దగ్గరగా) ఆగు!

శ్యాం: (చేతిలోని కత్తి కిందికి దించి ఆశ్చర్యంతో వెనక్కి తిరిగి) ఎవరది?

జగ: ఏంచేస్తున్నావ్ నాయనా?

శ్యాం: అన్యాయాన్ని పాపాన్ని హత్యచేస్తున్నాను.

జగ: హత్యచేస్తే నీకేమొస్తుంది?

శ్యాం: పాపాన్ని శిక్షించానన్న తృప్తి!

జగ: శిక్షించడానికి నువ్వెవరవు నాయనా! ఎవరి పాపం వాళ్ళనే శిక్షిస్తుంది. తొందరపడకుండా ఆగిచూడు. ప్రతి పాపానికి ఫలితం కనిపిస్తుంది తప్పక. (నిష్క్రమిస్తాడు.)

శ్యాం: (మెల్లగా) ఎవరి మాటలు? — నాలో యేవో విచిత్రమైన భావాలు రెక్కలు కట్టుకొని యెగురుతున్నాయి. (చూస్తూ) ఎవరూ కనిపించరేం? ఈ చీకటి ప్రపంచంలో నేను పశువుగా మారిపోయాను. (కత్తి దూరంగా విసిరేస్తాడు.) యమునా, యిక నీ పాపానికి నిన్ను విడిచిపెడుతున్నాను. విశ్రాంతిగా, సంతోషంగా నూరేళ్ళు బ్రతుకు. నీ దారికి నేను కలలోకూడా అడ్డురాను. (వెళ్ళిపోతూవుంటాడు)

యము: (అతనిదారికి అడ్డువచ్చి) ఆగు శ్యాం! నా మాట విని వెళ్ళు. లేకపోతే నేను కుమిలికుమిలి చావవలసివుంటుంది.

శ్యాం: నన్ను తిరిగి చీకటితెరలలోకి తీసుకవెళ్ళకు.

యము: మనం యిద్దరం కలుసుకున్న ఆఖరురోజు జ్ఞాపకంవుందా శ్యాం?

శ్యాం: గతాన్ని యిక జ్ఞాపకం చెయ్యకు.

యము: ఆ రోజే నీకు చెప్పాను.

శ్యాం: ఏమని?

యము: భరించలేనని. నన్ను నరకంనుంచి తప్పించమని.

శ్యాం: నాలుగురోజులు ఆగమన్నాను.

యము: ఒకరోజు ఒకయుగంలా కనిపించేది. దరిద్రం, రోగం, చావు, భయం—అన్నీ అక్కడ తాండవించాయి. ఆ రోజు తలుచుకుంటే నా గుండెలు ఇప్పటికీ భయంతో జలదరిస్తున్నాయి. అప్పుతీర్చలేదని ఒక పెద్దమనిషి వచ్చి మా నాన్నను నోటికి వచ్చినట్లు తిట్టాడు. మా నాన్న అవమానం భరించలేక—వెర్రి ఆవేశంతో అతని మీద పడ్డాడు. నేను భయంతో కళ్ళుమూసి తెరిచే సరికి—రక్తపాతం—పోలీసులు—నాన్న చేతికి సంకెళ్ళు—క్షణాలలో సర్వనాశనం జరిగిపోయింది. నేను ఒంటరిగా రోడ్డెక్కాను.

శ్యాం: (జాలిగా) నాకేదీ తెలియదు యమునా!

యము: నీకోసం చూశాను. నువ్వు క్రితంరోజే ఎక్కడికో వెళ్ళినట్లు తెలిసింది. అవమానంతో—బాధతో, దిక్కుతోచక తిరిగే సమయంలో రఘుపతి కనిపించారు. నన్ను పిలిచారు. చేరి

కాదనలేక పోయాను. నేను ఊహించింది ఒకటి. చివరకు జరిగింది మరొకటి.

శ్యాం: (శాంతంగా) యమునా!

యము: (ప్రార్థనా పూర్వకంగా) నా చివరి కోరిక తీర్చు శ్యాం! నన్ను క్షమించానను చాలు.

శ్యాం: నిన్ను క్షమించడానికి నే నెవర్ని యమునా!

యము: శ్యాం! క్షణికమైన భ్రమలోపడి శాశ్వతమైన ఆనందాన్ని పోగొట్టుకున్నాను.

శ్యాం: నా కళ్ళు తెరుచుకున్నాయి. నీ సంతోషమే నా సంతోషంగా భావించుకుంటాను. నువ్వయినా సుఖంగా బ్రతుకు యమునా! ఇక నేను పోవాలి.

యము: (అతని రెండు చేతులూ పట్టుకొని వెక్కి వెక్కి యేడుస్తూ) మూస్తూ—చేతులారా నిన్ను విడిచి పెట్టలేక పోతున్నాను శ్యాం!

శ్యాం: (ఆమె తల నిమురుతూ) యమునా!

యము: దరిద్రం—తన యినుప పాశంతో నన్ను పాతాళంలోకి తొక్కిపెట్టింది. నన్ను ఒంటరిగా విడిచిపెట్టి వెళ్ళిపోతావా శ్యాం?

శ్యాం: (ఆత్రుతతో) ఎవరైనా వస్తారు. వెళ్ళిపోవాలి. ఇక నన్ను విడిచిపెట్టు యమునా!

యము: నీతో నేనుకూడా వస్తాను.

శ్యాం: (చకితుడై) ఎక్కడికి?

యము: ఎక్కడికైనా సరే! మృత్యుదేవత ఒడిలోకి కూడా నవ్వుతూ వస్తాను.

శ్యాం: వద్దు. వద్దు. చేతికి అందిన సౌభాగ్యాన్ని అనుభవించడం నేర్చుకో.

యము: సౌభాగ్యానికి ఒకేఒక మార్గం జ్యోతిలా కనిపిస్తోంది.

శ్యాం: యేమిటది?

యము: విషపాత్ర.

శ్యాం: యమునా!

(బిగ్గరగా తలుపుతట్టిన చప్పుడు వినిపిస్తుంది.)

శ్యాం: (ఆత్రుతతో) ఎవరో వచ్చారు! యిక విడిచి పెట్టు. (చెయ్యి విడిపించుకోడానికి ప్రయత్నిస్తాడు)

యము: (గట్టిగా పట్టుకొని) వెళ్ళకు శ్యాం. ఎంత స్వార్థపరుడవు! నువ్వొక్కడవూ వెళ్ళిపోదామనుకుంటున్నావా?

శ్యాం: (భయంతో) నీకేం మతిపోలేదు కదా!

యము: నువ్వు నాతో వుంటే ప్రపంచం ఎంత అందంగా కనిపిస్తోంది!

శ్యాం: (భయంతో) అదేమిటి? నీ కళ్ళల్లో యేవో నీడలు కనిపిస్తున్నాయి. నీ పెదాలు కంపిస్తున్నాయి. నీముఖంలో యేమిటి యీ మార్పు!!

(బిగరగా యిల్లు ప్రతిధ్వనించేలా తలుపుచప్పుడు)

యము: సంతోషం మహాసముద్రంలా విరుచుకు మీద పడుతోంది. శ్యాం(అతనిని దగ్గరకు లాక్కుంటూ) సముద్రంలోపడి యిద్దరం కొట్టుకుపోతున్నాం కదూ?

శ్యాము: (ఆత్రుతతో) నీకు మతిపోతోంది. అదిగో తలుపులు పగిలిపోతున్నాయి. ఇక నన్ను విడిచి పెట్టు.

(బిగరగా పిలుపులు, తలుపుకొట్టిన ధ్వని వినిపిస్తాయి.)

యము: (పరవశత్వంతో) ఎంత అందమైనకల! కళ్ళు తెరిచే అంతా మాయమై పోతుంది. శ్యాం ఏదీ ఒక్కసారి నవ్వు.

శ్యాం: (ఆమె రెండు భుజాలు పట్టుకొని వూపుతూ) కళ్ళు తెరిచిచూడు. అదుగో భూమి బద్దలైపోతున్నట్టు—ఆ చప్పుడు విను.

శ్యాం: నేను యిటు పారిపోతాను. నువ్వు తలుపు తియ్యి.

యము: నువ్వేమైనా దొంగవా పారిపోవడానికి? వద్దు. ఆగు. (ఆకస్మికంగా కుడివైపు తలుపు తెరుచుకుంది. వెంటనే రఘుపతి ప్రవేశిస్తాడు.)

రఘు: (శ్యాంచెయ్యిపట్టుకొని) ఎలా వచ్చావిక్కడికి?

శ్యాం: (సూటిగా) గోడదూకి వచ్చాను.

యము: లేదు. నేనే అతనిని తీసుకువచ్చాను.

రఘు: (కోపంతో) యమునా!

యము: ఇక అతనిని విడిచిపెట్టండి.

రఘు: ఇంకా భయంలేకుండా మాట్లాడుతున్నావా?

శ్యాం: లేదు. ఆమెకేం తెలియదు. ఆమెను చంపడం కోసం నా అంతట నేనే గోడదూకి వచ్చాను.

రఘు: (ఆశ్చర్యంతో) ఎవరిమాట నమ్మాలో నాకు తోచకుండా వుంది!

యము: నేను అతనిని హృదయపూర్వకంగా ప్రేమించాను. నేను ఎక్కడవున్నా నాకు అతనిమీద ప్రేమపోదని తెలుసుకున్నాను.

రఘు : (కోపంతో) నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుస్తోందా?

శ్యాం : ఆమెకు తెలియడంలేదు. నేను చెబుతున్నాను విను. రఘుపతీ.

రఘు : (కోపంతో శ్యాంను ఒక్కటి కొట్టి) నోర్ముయ్. ఈ అలజడికి, యీ తిరుగుబాటుకు కారకుడవు నువ్వు! (బిగ్గరగా) చంద్రయ్యా! (చంద్రయ్య వస్తాడు) వీణ్ణి కాళ్లూ చేతులూ విరగ్గొట్టి అవతల పారెయ్.

(చంద్రయ్య శ్యాం నోరునొక్కి బలవంతంగా యీడ్చుకుపోతూ వుంటాడు.)

యమున : భయంలేదు శ్యాం. నేను నీవెనుకే వస్తున్నాను (వెళ్లిపోతుంది.)

రఘు : (కోపంతో ఆమె చెయ్యి పట్టుకుని) ఎక్కడికి?

యమున : నన్ను విడిచిపెట్టండి. (చంద్రయ్య శ్యామ సుందరంతో నిష్క్రమిస్తాడు) అదుగో! అతను దూరమై పోతున్నాడు. నేను కలుసుకోవాలి.

రఘు : (కోపంతో) నీకు సిగ్గు తెలియడంలేదా? (బలవంతంగా ఆమెను గదిలోకి యీడ్చుకు వెడుతూవుండగా ఆమె "శ్యాం శ్యాం" అని బిగ్గరగా పిలుస్తూ వుంటుంది. చివరకు రఘుపతి ఆమెను గదిలో పెట్టి తలుపు వేస్తాడు. ఒక నిట్టూర్పు విడిచి రఘుపతి ముందుకు అడుగు వేస్తాడు. చంద్రయ్య వస్తాడు.)

చంద్ర : పొగ రణిగి పోయింది.

రఘు : యేం చేశావ్?

చంద్ర : బండిమీద పారేశాను.

నేపథ్యంలో (బిగ్గరగా) రఘుపతిగారూ!

రఘు: ఎవరది? (చంద్రయ్యతో) ఎవరో చూడు. (చంద్రయ్య కుడివైపు వెళ్లి ఒక కవరు చేత్తో పట్టుకొని వస్తాడు.)

చంద్ర: టెలిగ్రాం బాబూ!

(కవరు రఘుపతికి యిస్తాడు. రఘుపతి కవరు చింపి చూస్తాడు. చేతిలోంచి కాగితం జారి పోతుంది. ముఖం వెల వెల పోతుంది.)

చంద్ర: అదేం బాబూ?

రఘు: మతిపోయింది. విమలకు మతిపోయింది.

చంద్ర: అమ్మగారికి! ఎంత మంచి తల్లి!

రఘు: అబ్బబ్బ! ఏమిటో తెలియకుండా వుంది (కోపంతో) చంద్రయ్యా! ముందు బైటికి పో నువ్వు! (ఉన్మత్తుడిలా) పో!

(చంద్రయ్య నిష్క్రమిస్తాడు)

నేపథ్యంలో: (బిగ్గరగా) రఘుపతీ!

రఘు: (ఉలికిపడి) ఎవరు?

నేపథ్యంలో: (మరొక గొంతు బిగ్గరగా) రఘుపతీ! (నేపథ్యంలో స్త్రీ వికటాట్టహాసం బిగ్గరగా వినిపిస్తుంది. ఒక్కసారిగా "రఘుపతీ! రఘుపతీ!" అని హాలు ప్రతిధ్వనించేలా పిలుపులు వినిపిస్తూ వుంటాయి. రఘుపతి తల రెండు చేతులతో పట్టుకొని సోఫాలో పడిపోతాడు. రంగస్థలం తిరిగి చీకటిలో మునిగిపోతుంది)

స్త్రీ గొంతు: (బిగ్గరగా) రఘుపతీ! రఘుపతీ! ఇప్పటికైనా నీకళ్లు చల్లబడ్డాయా రఘుపతీ!

ఒక గొంతు: (బిగ్గరగా) రఘుపతీ! నీచుట్టూ కార్చిచ్చు.

మరొక గొంతు: (బిగ్గరగా) రఘుపతీ! రఘుపతీ! అదుగో నీ అర్ధాంగి!—విమల!—చూడు యెలా వుందో! జుత్తు విరబోసుకు వస్తోంది!

(స్త్రీ నవ్వు భయంకరంగా వినిపిస్తుంది. కేకలు నవ్వులు ఆగిపోతాయి. రంగస్థలం మీదికి ఉవ్వెత్తుగా ఒక్కసారి వెలుతురు వస్తుంది. గది అంతా ఖాళీగా వుంది. భయంకరమైన నిశ్శబ్దం. సోఫాలో రఘుపతి పడుకుని వున్నాడు)

రఘు: (ఉలికిపడి లేచి) ఎవరది? ఎవరు?

జగ : (ఎడమవైపు నుంచి తడుముకుంటూ వచ్చి) ఎందుకు నాయనా! అలా కలవరపడుతున్నావు? నిద్ర పట్టలేదా?

రఘు: పీడకల! భయంకరమైన కల!

(దూరాన్నుంచి కొండ గుహలోంచి పిలుస్తున్నట్లు "రఘుపతీ! రఘుపతీ!" అని పిలుపు వినిపిస్తుంది)

రఘు: (కలవరపాటుతో) అదుగో! అదుగో! ఎవరో పిలిచారు!

జగ : ఎవరూ కాదు నాయనా! నీ అంతరాత్మే నిన్ను పిలుస్తోంది!

(జగన్నాథం నిష్క్రమిస్తాడు. రఘుపతి తల రెండు చేతులతో పట్టుకొని సోఫాలో కూలబడతాడు—తెర.)

# భాస్కర రామాయణము

శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి

అనంతములైన అనర్ఘమణులలో భారత భాగవత రామాయణములు అగ్రేసర భాసమానములు. అవి భారతావనికి అర్షవాణీ వరప్రసాదములు. ఆంధ్ర సరస్వతి అదృష్టవశమున భారత భాగవతములు అస్థాయిని భాగధేయములు. అందుకు ఉద్దీపకులైన రాజరాజనరేంద్రుడు, ఉదాత్తరసాన్వితుడైన నన్నయభట్టు ప్రాతః స్మరణీయులు. మరి, పదునైదు పర్వములు పారము ముట్టిన తిక్కనసోమయాజి, అన్యధీధురంధరమైన అరణ్యపర్వశేషాన్వయమే గాక, భారతశేషాన్వయమే ఆదరించిన (హరివంశము భారతఖిలపురాణము.) ఎఱ్ఱాప్రగడ, రామభద్రుడే పలికించిన బమ్మెర పోతనామాత్యుడును భావాంబరవిక్రుతివిహారులు. ఆ శ్రేణిని, రామాయణ రసవాణిలేమి ఆంధ్రుల దురదృష్టము.

ఆంధ్ర రామాయణముయొక్క అవతరణమే, ఒక అగాధ సమస్య. మంత్రిభాస్కరుడు రామాయణ కర్తగా జనశ్రుతిమాత్రమే గాక, ఒక అర్వాచీన సిద్ధాంతము. ఆ సిద్ధాంతమందలి యోగము లేమోగాని, మరి, వాస్తవమున, ఆంధ్రరామాయణావతరణము అపూర్వ సంఘటనమే. అంత రామాయణమున అన్ని రసవద్ఘట్టములుకల అరణ్యకాండము ఉండగా, అందును పారాయణ ప్రవణమైన సుందరకాండ ముండగా, ఉత్తర రామాయణమునకు ఉద్రూతిలాగు ప్రవృత్తి, "రామధరణీపతి పద్యప్రతిమ ఎత్తితే నైనను సంభావ్య"మైనప్పటికిని, మరి, విస్మయజనకము. అట్టి ప్రవృత్తి తిక్కనవంటి "కళాపారగునకు" కలుట మఱింత ఆశ్చర్యము. సంస్కృత సారస్వతమున రూపకరచన తొలి ఉద్యమములలో, ఉపాదేయమైనది పూర్వరామాయణమే. తరువాతనే "మహావీర చరిత్ర" తరువాతనే "ఉత్తర రామ చరిత్ర." ఆంధ్రసారస్వతమున మాత్రము అట్లు గాక, ఉత్తర రామాయణమే ముందున్న ఉత్సవ విగ్రహము. ఆ నిర్వచనరచనమును విలక్షణము. ఇంతియును, ఉత్తర రామాయణము వాల్మీకికృతము కాదనియే కొందరి అభిప్రాయము అది నిజమైన, వాల్మీకి రామాయణమునకు, "స్వతంత్రమో, అస్వతంత్రమో, స్వతంత్రాస్వతంత్రమో" — ఆంధ్రీకరణ మన్నది అర్వాచీన విషయము. కాలదోషము, కర్మఫలమును పట్టించుకున్న, అందుకు మరి ఆంధ్రసాహిత్య క్షేత్రమున ఏకవాక సాగించినది గోనబుద్ధారెడ్డియే. తదుపరి, ప్రబంధపరమేశ్వరుని ప్రయత్నము. ఎఱ్ఱాప్రెగడ రామాయణమునకు ఏ దుర్భాగ్యహస్తమున దృష్టి తగిలినదో గాని, ఇప్పటికిని నష్టమిగిలినది. పుష్కలుగుట అస్తి నాస్తి విచికిత్సాసహము. ఇక మిగిలినది భాస్కర రామాయణము. ఇది ప్రకృత విషయము.

భాస్కరరామాయణ విషయమొక బహు సమస్యాభూతమైన మహాసముద్రము. సముద్రపుటొడ్డున ఇసుక తిన్నెలలో తిరిగి వన్నెలలో చూస్తుండి, కెరటాల తాకిడిలకు సముద్రగర్భమందలి రత్నరాసులను కాంచితిమనుట హాస్యాస్పదము. సముద్రవిగాహన సదృశమైనది భాస్కర రామాయణ పరిశోధనము. వితత్పరిశోధనావకాశతా ప్రతిపాదనమునకిది ప్రాతిపదిక మాత్రము.

భాస్కరరామాయణము ముద్రిత ప్రతికంటె తాళపత్రప్రతులలో భిన్నభిన్నములైన అశ్వాసాంత గద్యలు కలవని, "ఆంధ్రకవుల చరిత్ర"లో శ్రీ కందుకూరి వీరేశలింగము గారు స్పష్టముగా చెప్పిన సంగతి. అంతేకాదు, మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములోని అశ్వాసాంత గద్యల అన్యథావిధానమును శ్రీ వీరేశలింగము గారి స్పష్టప్రతిపాదనమే. ఆ మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని మద్రాసు విశ్వవిద్యాలయములోని, తాళపత్రప్రతుల అయోధ్యా (రణ్య) కాండాశ్వాసాద్యంత పద్యగద్యముల పద్ధతి, "ఆంధ్రపత్రిక విక్రమ సంవత్సరాది సంచిక"లో శ్రీ వేటూరి వేంకటరమణయ్యగారు ఉదాహరించిన విషయము. అశ్వాసాద్యంతపద్యగద్య భేదములనుబట్టి

తీసికొనివచ్చెను. తండ్రిస్థితికి తలడిలిన రామునికి చల్లని కబురు చెప్పినటి చలని తలి కైకేయి! "ధన్యుడ" నన్న రాముడు. 'శీఘ్రముపొమ్ము'నన్న పిన్నమ్మకును నమస్కరించి, లక్ష్మణుడు కోపమున ఏడ్చుచున్నను, 'కైకయింటి'నుండి 'కౌసల్యనగరి'కి 'పాదచారియై' యాత్రము వచ్చినాడు. పట్టాభిషేకమునకు విఘ్నము రాకుండా ప్రార్థనలు సలుపుచున్న కౌసల్య పుత్రాగమన వార్త విని, పుణ్యాంగనలతో, మంగళ ద్రవ్యములతో ఎదురు వచ్చినది. ఈ సందర్భమున అచ్చుప్రతిలో ఇట్లు కలదు.

"(కౌసల్య)...ఎదురేగుదెంచి ముఖేంగిత లక్షణం బుపలక్షించి యా రాజరత్నంబు గనుంగొని,)-110.

ఉల్లము ఝల్లన వెంగమున
జలదవం బొలయఁ దాల్చి పిపాసఁ గనెం
దల్లడిమందుచునుండెఁగ....-111."

అనగా కౌసల్య చూచినది రాజరత్నమైన రాముడేను, ముఖేంగిత లక్షణోపలక్షణము మాత్రము ఆమె అవస్థకు హేతువుగ అతిస్పష్టము. 'రాజరత్నమైన రాముని ముఖేంగిత లక్షణమును కౌసల్య ఉపలక్షించినది.' అనగా అంతర్నిశితదృష్టి ఆమెకు కలదన్నమాట. అట్టితల్లికి ప్రణమిల్లి, రాముడు కైకవరముల సంగతి చెప్పి, వెంటనే అన్నట్లు, అచ్చుప్రతిలో ఉన్న విషయ మిది:—

"ఏవిల్లు తపోవేషముఁ
బూని నరేంద్రుండు వగలఁ బొగులుచునుండం
గా, నేతెంచితి నిటకును
మానసమున దీని కింక మలుఁగకుము..." 113.

అనగా రాముని అప్పటిస్థితి 'తపోవేషము' అని స్పష్టముకదా! మరి, ఆ తపోవేషము ఎప్పటి నుండి స్థితి?—'నరేంద్రుండు వగలఁ బొగులుచునుండంగా నేతెంచినప్పటినుండి స్థితి. అనగా కైక అంతఃపురమున, దశరథుని సమక్షమున, రాముని తపోవేషధారణము. కాని రాముడు కైకయింట తపోవేషము ధరించినట్లు పూర్వకథలో లేదు. అదొక "నస్పెన్సు" అనుకొందమన్న, ప్రాతిపదికలేని అకస్మాత్ మాతిన విషయచాలనము. ఆ శిల్పమునకు లక్షణమే కాదు. పోనీ కాళిదాసు అభిజ్ఞానశాకుంతలములోని అంగుళీయక వృత్తాంతమున కిది సదృశమనుకొందమన్న, శకుంతలవలె కౌసల్య అజాగ్రన్మతి కాదు. ముఖలక్షణమునుబట్టి, మూడినవిపత్తు గ్రహించగల సమర్థురాలు. అంత సమర్థురాలికి మరి, రాముని తపోవేషమే కనిపించలేదా?-విపరీతమైన తాపసవేషధారణము పట్టాభిషేకసమయమున కొట్టవచ్చినట్లు కనిపించునదికదా! అట్టివేషము అర్హకృత్యమైన వసిష్ఠులవారిని సైతము 'అయ్యో! రాముని పట్టాభిషేకము. వీరాగు పట్టు పీతాంబరములు కట్టకొనవలదా?' అనవలసిన కౌసల్య రాముని తపోవేషము చూడక ముఖలక్షణోపలక్షణము చేయునా? ఆ వేషమును కౌసల్య చూచిన "ఆ వేష మేమినాయనా!" అనికదా ఆమె పడవలసిన అవస్థ. అడుగవలసినదికూడ అదే. కాని, అటుడుగలేదు. అవలట్లు చూడనులేదు. ఆమె చూచినది, ఉపలక్షించినది, రాజరత్నమైన రాముని ముఖేంగిత లక్షణమే బాహిరమైన తాపసవేషధారణ ముండగా, అంతరమైన ముఖోపలక్షణము అనవసరము. అనగా రామునికి అప్పుడు తాపసవేషధారణము లేదని స్పష్టము. కలదని రాముని కంఠోక్తి. మరి కనిపించలేదనుట కౌసల్య నిశితదృష్టికి విస్ఖలనము, కనుక నిది అచ్చుప్రతిలోని అసందర్భమే కదా!

ఇంతకు అచ్చుప్రతిలోని కౌసల్యా ముఖలక్షణోపలక్షణవిషయము కుండలీకృతిభాగము అకుండలీకృతి సుద్దిష్ట వచనమును తొలగించిన రాముడుంచునది కైకయింట! కౌసల్య తల్లడమందునది తనయింట! అందుకు హేతువు ఆమె నే అడుగవలెను... ఇక ముద్రిత ప్రతి నొకమూల పెట్టి, మూలపెట్టిన తాళపత్రప్రతి బూజు దులిపిన, సందర్భశుద్ధియే గాక, మరి, సంధిమాశ్చర్యకర సన్నివేశ కల్పనా చాతుర్యము స్వయంవేద్యగానము. అది తాళపత్రప్రతులలోని అయోధ్యాకాండమున గల అత్యపూర్వ విశేషము.

## తాళపత్రప్రతిలోని అత్యపూర్వవిశేషము

నిజమునకు వాల్మీకి.అయోధ్యాకాండ ఒక శిఖరశేఖరమైన శిల్పకళాఖండము. అద్భుత రసదర్శనము. మన సత్త్వ చిత్రణమున మణిదర్పణము. అట కైకేయి రాక్షసి కాదు. సతతపోషగల సామాన్యపు సంసార స్త్రీ. అభిజాత్యమునుబట్టి అంతఃపురవాసము. ఇక మంథర ఒక మహారాక్షసి. మహారాక్షసియే కాదు. మహాకుబ్జ! పొట్టివారికి పుట్టెడు బుద్ధులట!—మానవ

సహజ హృదయదౌర్బల్యమును పసిగొట్టినది మంథర పాలిక పారలేదు. నీరసత్వ ప్రకోపన విధి తిముగా మంథర చేసిన మహోపన్యాసమున గాని, కైకమనసు మారలేదు. భావ్యవర్ధక భీతిని మాత్రము కైకమనసు మారినది. అదికూడ మానవసహజమైన మానసిక నీరస స్థితివలన మాత్రము. అనగా కైకేయి విషాదనాటక పీరనాయిక. లేడీ మేగ్బెత్ కంటె వయము. ఇంతకు, మహోకుబ్జ మంథర ఉపాయము చెప్పినది. ఉబ్బి తబ్బిబ్బైనది కైకేయి. ఆ గూనిదాని గూనికే బంగారపు తొడుగు చేయించెదనన్నది. తనపంతము చెల్లకున్న తాను చచ్చినటు లెక్కన్నది. చచ్చినటు వరము లిచ్చినాడు దశరథుడు. మాడరమ్యనిన రామునికివరముల సంగతివల్లె వేసినది కైక. జనకుజాజ్ఞ జవదాటలేని రాముడు తండ్రికి చెప్పి, తల్లిదగ్గరకు వచ్చి, కన్నతల్లి కౌసల్య దుఃఖార్ణవమును దాటి, లక్ష్మణుని అగ్రహాగ్ని పర్వత ప్రజ్వలనమును చల్లార్చి, అనాయక సీత అకారణ ప్రవృత్తి శోకమును అనునయించి, అనుమతించి, లక్ష్మణ సీతా సమేతుడై వసిష్ఠపుత్రు డైన సుయజ్ఞునింటికి వచ్చిన మీదట వల్కల ధారణము! కారణము, రాజాంతఃపురముల నుండువని రత్నాంబరములు కాని వల్కలములు కొనిపోవుటయే. ఇంత సూక్ష్మరీతియు జ్ఞాన వ్యక్తి ఏకైక లోకైక మహాకవి వాల్మీకి!

ఇక భాస్కరుని అయోధ్యాకాండమున మంథర నిమిత్త మాత్రము. కైక రక్కసి. అనగా వాల్మీకి రామాయణమునందలి మన సత్త్వ చిత్రణ మహత్త్వ కవిత్వ పటుత్వము ఆంధ్రీకరణమున అంతవిఫలము. కాని, భాస్కరుని కైకేయీ వరద్వయ ప్రసాన ఘట్టమొక ప్రత్యేక సృష్టి. అది మాలాతిశాయి. ఆ మాలాతిశాయి విషయమే మూలబడిన తాళపత్ర ప్రతిలోని అత్యపూర్వ విశేషము.

రాముడు 'కైకయరాజనందన మందిర ద్వారమునకు' వచ్చి, 'బాహ్యకుల లోచనములు దీపవదనుడు' నైన తండ్రిని జూచి, 'భీతుడై యు' కైకేయికిని నమస్కరించి కారణమడిగినాడు. అడిగిన వెంటనే ఆమె వరముల సంగతి చెప్పినది. ఆ చెప్పుటలో ఒక విశేషము. అసలు కైక అడిగిన వరములు భరతుని పట్టాభిషేకము, రాముని అరణ్యవాసము మాత్రమే. ఆ వరముల ప్రకారము రామునకు అరణ్యవాసమును అంతఃపురవాసముగా సాగింపవచ్చును. సంస్కృత రామాయణమున అట్లు సాగించుట అనవకాశము.

"నవ పఞ్చ చ వర్షాణి దండకారణ్య మాశ్రితః,
చీరాజిన జటాధారీ రామో భవతు తాపసః."

అని యాట ప్రశ్నా ప్రతిపత్తి. అరణ్యవాసమునకు కలదు. ఆంధ్రరామాయణమున అట్లు లేదు. అని చెప్పి కైక తక్కువ తినలేదు. రక్కసికదా! అక్కడ వరములు అట్లడిగినది. ఇక్కడ రామునితో, "నినుఁ బదునాలు గేడులు మునివృత్తికిఁ గావనుఁ బుచ్చుట" అన్నది. అంతకు తెగించిన దానికి అబద్ధ మొక లెక్కా? అని కాబోలు నోరెత్తలేదు దశరథుడు. రామునకు మాత్రము "ఏమ్మడ పోగన కానీ" అన్నాడు. అనగానే సీత అందుకొన్నది. "కానీ నీవు చనంగ నేను... నీవెనుక వచ్చెదను." అని అందుకు హేతువులను అందిచ్చినది. అప్పుడు రాముడు అక్కడే. ఆమెకు తెలియని కావలసంగతి చెప్పినాడు. అయినను సీత "నినుబాసి బ్రతుకుటకంటె మరణము" మేలన్నది. అంతఃపురమున అరణ్యవాస శ్రేణి జ్ఞాపనమున అదరిక తప్పని దశరథుని గుండెలు, ఆమాటలకు గుభాలుమనక తప్పదు. ఒక్క దశరథునికే కాదు; సహృదయునకే కైతము. ఇది కథాసన్నివేశ కల్పనా కల్పమైన రసపోషక సైధ్యరచనా శిల్ప నిర్మాణ మార్మికత. ఇంతకు సీతరాకకు రాముడనుమతించినాడు. అనుమతించగానే లక్ష్మణుడు "కోపంకొమ్ము డులుచు బొమలు గీలించి విస్ఫులింగములు చెదర" దశరథుని చేయెత్తి చూపుచు "ఈతని పతికుబ్జుడై మతితప్పి ఆలిమాటలు విని యింత తెంపున గొడంబడి తానొక సత్యవాదియై పలుక డె" అని తట్టపడ పెటినాడు తండ్రిని. అప్పటి దశరథుని అవస్థ దుర్భాహము. సహృదయుని అవస్థ సానుభూతి సంలగ్నత, అటునిటు సంశయ డోలాందోళిత సహాము. అది మరి చిత్రిక పట్టిన శిల్ప నిగూఢ మార్మికత చిందిన రసనిర్భరత. అనగా సదికథా సన్నివేశకల్పనాశిల్ప పరకోటి. ఇక అచ్చు ప్రతిలోని లక్ష్మణుని ఆవేశము కౌసల్య సమక్షమున! ఎందుకు? — వృథావాగ్వ్యర్థము. మరి తాళ పత్ర ప్రతిలోని లక్ష్మణుని ఆవేశము దశరథుని సమక్షమున! కైక సన్నికటమున! ఆవశ్యకమైనది అక్కడే. అంతే కాదు. "ఈతఁ డతి కుబ్జుడే" అను ఇనుమిక్కి వినతు దశరథ సమక్షమునందే సముచితము. ఇంతకు, లక్ష్మణుడు అయోధ్యాపట్టణమునే ఛిన్నీభూతము చేసియున్నాడు. అందుకు రాముడు అనవలసిన మాట

లని, "మహారాజ్యం భరతునకిడనుండి నీతిస్థిరమతి రాజ్యంబు నీవు సేవింపవయా!" అన్నాడు. ఆ మాట చాల కైకమ్మకు. అయినను లక్ష్మణుడు "వనభూములకు నన్ను పెక్కులఘోరిక రాకలదన్న ప్రాణములు వదిలెద" నన్నాడు. అనుమతించక తప్పలేదు అనుజాతునకు రామునకు. అప్పుడు దశరథుడు అతని నిశ్చయమెరిగి, సుమంత్రుని జూచి "రామునకు సకలరాజ్య సంపదలతో వెళ్ళుము నీవు, శూన్యమైన పురము భరతుడేలనిమ్ము. పాపంబు సిద్ధించె. కైక తన చేతి కట్టకొనియెను —" అన్నాడు. "భరితశోక జనిత పరితాప దందహ్యమాన హృదయుడై"! అనగా కైక అప్పుడు "తన సమక్షమున రాముడు నారచీరలు కట్టుకొని కాననభూమికి సర్వ శూన్యుడై చనవలె" నన్నది. వర మడిగినప్పుడా నాటికా కోరిక. రామునికి చెప్పినప్పుడు ఆకోరిక తెలుపబడినది. ఇప్పుడు నిప్పులు త్రొక్కినది. నరదివ్యభావను విపన్నృతు ముసకిది చీరలిందు పతాకలు. అనుపూర్వికల్పన అంతిర వేదిక. అనగా నాటకీయతా ముద్రితమైన కథా కథనము. పతాకాకస్థ నందిన పరమనాటకీయతా పరాయణమైన కథాకథన శిల్పమిక పరాఙ్ముఖము. అది ప్రధాన కథా ప్రయోజనము. అప్పుడు రాముడు "అట్టే చేసెదము. ముని వేషమునకు వల్కలాదులు కొనితేర పంపుము," అన్నాడు. తక్షణమే తెప్పించినది కైకేయీ మహారాజ్ఞి! అప్పుడు — అక్కడ — రాముడు, సీత, లక్ష్మణుడు తపోవేషములు తాల్చిరి. "పదునాలుగేడులు పదునాలుగు దినములుగ" తిరిగి వచ్చెద మని చెప్పి "తన్ను మఱచియున్న తండ్రిని" వీడ్కొనిరి. ఇంతవఱకు జరిగిన కథనుబట్టి, తనకైన వ్యాఖ్యకు, మనోవ్యథకు, దశరథుడు 'తన్ను మఱచియుండుట" తప్పని సరి. ఆ "తన్ను మఱచియున్న" స్థితియే అనంతరకథా ప్రాతిపదిక. అది విపర్యాంతరము, ప్రకృతము,"తన్ను మఱచియున్న తండ్రిని వీడ్కొని" రాముడు, తమ్మునితోను, భార్యతోను, "మునుముతో తలిపాలికి నరుదెంచినాడు."అప్పుడు కౌసల్య, పాపము తనయుని పట్టాభిషేకమునకు విఘ్నము గాకుండ విహితవ్రతతో పవాసములు గైకొన్న తల్లి — పుత్రాగమన వార్త విని పుణ్యాంగనలతోను మంగళద్రవ్యములతోను నీరాజన మిచ్చుటకు ఎదురేగుదెంచి,

"ఆ రాజఋషిరత్నంబు గనుంగొని
ఉల్లము ఝల్లన మొగమున
వెల్లదనం బొలయఁ జాల్గ్రీవిసంగఁగనుం
దల్లడ......"

మందినది. అనగా కౌసల్య చూచినది రాజరత్నమును కాదు; మరి? రాజ ఋషిరత్నమును. కనుక ఉల్లము ఝల్లన తల్లడమందినది. రత్నముయొక్క విలువ కలదీ రాజఋషిరత్న మనుమాట! అటేంతము అచ్చు ప్రతిలో అంగ్లితము! అనవసర ముఖోపలక్షణము! తిరుతాపి, అసందర్భము. అచ్చుప్రతిలోని అసందర్భ మతి తాళపత్రప్రతి సహాయమున పటాపంచలయినది. సరికదా, రాముడు కైక యింటికి వచ్చినది మొదలు కౌసల్య నగరికి తిరిగి వచ్చువఱకు రసనిర్భరమైన కథానిర్మాణము కరతలామలకము. అది మరి అవశ్య గమనార్హమైన అత్యపూర్వ విశేషము. కారణమిది భాస్కర రామాయణకర్తృత్వ నిర్ణయసాధకము. కథా విధాన పృథక్ఖ్యాతి కావ్యరచనా ప్రణాళిక గమనార్హము. మరి, కథాకలనమున, సన్నివేశ కల్పనా వైభవము, నాటకీయతా జీవనాడిగ రసనిర్భరతా ప్రాభవముకల భాస్కరుని కైకేయీ వరద్వయ పర్యవసాన ఘట్టమిది పాఠోద్ధరణమున మిక్కిలి తన్మయీభావయోగ్యము. తద్భిన్నమైన తాళపత్రగ్రంథ స్వరూప మిట్లు గ్రాహ్యము.

## భాస్కరుని కైకేయీ వరద్వయ పర్యవసాన ఘట్టము

అచ్చుప్రతిలోని అరవై మూడవ వచనమునుండి ఆరంభము: అందులేని అధిక వచన మిది :—

"—పాపోపదేశంబు చేసిన, కైకేయి సంతోషించి దానికిం బహుదానంబొసంగి యొక్కొందుసాచ్చి ముసుంగు దిగిచికొని, నేలంబడియుండె, యులఁగి యుల్లండె నా సమయంబున"

తరువాత 68, 71, 72, 78, 74, 75, 81, 82, 85, 87, 88 వచన క్రమము. 89వ వచనమునందు కుండలీకృతభాగములు లేవు. చివర 'పుణ్యకాంతలు సేయుంబనిచి, శుభలగ్నంబు సాధించి, సుమంతుం బిలిచి" అని కలదు. తరువాత 90, 92, 94 పద్యములు. అటుపైగల అధిక పద్య మిది:—

"ఇటకుం దోడ్కొని రమ్ము నావుడు వరం
జేతెంచి విచ్చేయు మ

"అని పలికిన నర్తేని
తినయుని తెంపెజెంగి యిట్లు తప్పదు దైవం
బును తన వారిం జూడెను
నను రాముడు [ఒడిని] నిమనంగలనింకన్."

(అచ్చు ప్రతిలోనిది అన్యథావిధము. 145 వ పద్యము.)

తిరువాత, 147, 149, పద్యములు. 149 వ పద్యమున ఎత్తుగీతి క్రింది విధము.

"—ఇంపు సొంపార పుత్రి! కౌవిమ్మ నీకు
ననుచు దీవించె, సౌమిత్రి వినతుండైన
అన్న లక్ష్మణ! నీ [వు] మా యన్న వెనుక
జనియొదె, పట్టె సుఖంగ నమ్మనుమం బలికె."

తిరువాత, 215, 216, 217, 218, 219, 220 వరకు క్రమము. అటుపైగల అధికవాక్యము. "అని పలికె లక్ష్మణుండు నమస్కరించిన దీవించి"—తిరువాత 222 వ పద్యము. 224 వ వచనమున కుండలీకరించని వాక్యము. తిరువాత 225, 226 పద్యములు.

ఇది ప్రథమ ప్రతిలోని కైకేయీవరద్వయము పర్యవసానఘట్టము. ఇందుకు సంబంధించునది ద్వితీయ ప్రతి. అలతి మార్పులు, అలతి పాఠాంతరములు అప్రసక్తములు.

## ప్రధానమైన పాఠాంతరములు

అచ్చు ప్రతిలో 81 వ పద్యమున "విడుతుం బ్రాణము లయినను" అని కలదు. ప్రథమ ప్రతిలో నున్న పాఠము "విడుతుం బ్రాణము లడిగిన."—ఇది రెండవ పాదమునకు అనువైనది. అనగా ఛందస్సమ్మతి కల పాఠము, అంతేకాదు; ప్రాకరణికోచితము. 85 వ పద్యమున "అనంద కారు లగుచు సహజ గౌరవమున" అని కలదు. ప్రథమ ప్రతిలో నున్న పాఠము "ఆనంద కారి హారి సహజసౌరభముల"—ఇది సీస పద్యములోని మీది పాదములకు అనువైన పాఠము. అనగా ప్రకరణోచితము. 87 వ పద్యమున "అగాధ దీర్ఘికా" అని కలదు. ప్రథమ ప్రతిలో నున్న పాఠము "అపార దీర్ఘిక." దీర్ఘిక అనగా దిగుడుబావి. పాఠము తదుచితము. కాక, "చల్లని గాడ్పులు తిరిగి జలజ సవీన గంధములు చల్లుటకు" అగాధ దీర్ఘిక అసమర్థము. అపార దీర్ఘికను జలజముల అస్తిత్వమును అనుమానమే. కనుక ప్రథమప్రతిపాఠమే ప్రకరణోచితము. 90 వ పద్యమున "జేతువలయును వటువు వేంచేయు వలయు" అను పాఠాంతరమును అర్థనూన్యదనము ప్రథమ ప్రతిలోనున్న పాఠము "జేయుగా వత్సరికిని విచ్చేయు వయ్య" ఇది కార్యకారణ సంబంధముకు స్పష్టప్రతిపత్తియు ధారాశుద్ధియుకలపాఠము కనుక నిది సముచిత పాఠము.

1025 పద్యమున "మాక్తుపేసలు" అని కలదు. ప్రథమప్రతిలో నున్న పాఠము "మాక్తికపేసలు"—ఇది వైరిసమాసము అనగా వ్యాకరణదోషము. కాని ప్రయోగాంతర సమాధేయము. ఇక "మాక్తుపేసలు" ఇంతకంటె విచారణీయము. ముక్తా శబ్దముపై వృద్ధి రూపము మాక్తికము. మాక్తికరూప్రతిరూపము విధానాంతర సమర్థనీయము. ఇంతకు నిది యతిమైత్రి ఘటితము. అప్రసిద్ధ రూపముకంటె సుప్రసిద్ధ వైరి సమాసము సముచితము. అనగా 'మాక్తుపేసల'కంటె "మాక్తికపేసలు" నయము. రెండును సమర్థనీయములే. 107 వ పద్యమున "అయితేని" అనికలదు. ఇట్టి ప్రయోగము నన్నయాదులు సభాపర్వమునందును ఒక ముద్రితమున కలదు. అయినను రూప మిది అసాధువు. ప్రథమప్రతిలోనున్న పాఠము "అగుదేని" ఇది నిర్బాధకము. 160 వ పద్యమున "మనుముదివిచారము" అని కలదు. ప్రథమ ప్రతిలోనున్న పాఠము "మానుపు విచారము" రెండును సాధువులే. 187 వ పద్యమున తానుగా నితరులెఱుఁగుదురె" అని కలదు. ప్రథమ ప్రతిలోనున్న పాఠము "తానుగాక తక్కొఱుఁగుదురె" రెండును యతిగణోచితములే.

198 వ పద్యమున "రిత్తయగు భూభాగంబు" అని కలదు. ప్రథమప్రతిలోనున్న పాఠము "రిక్తపుర భూభాగంబు" ఇట "పుర" శబ్దము పునరుక్తమైనను. అయోధ్యాజనము అడవికిపోయిన భూభాగమంతయు రిత్తయగునది కాదు కనుక ప్రథమప్రతి పాఠము ప్రకరణోచితము. 213 వ పద్యమున "లిప్తనిర్మల భూతిఫాలము" అని కలదు. ప్రథమ ప్రతిలోనున్న పాఠము "లిప్తనిర్మలభూతిభాసురు" ఇది రీతి సుభగము. 116 వ పద్యమున "కామాంధుండనై నీకు నిట్టి తెరంగు" అని కలదు. ప్రథమ ప్రతిలో నున్న పాఠము "కామాంధుండుగా జాస కట్టి తెఱంగు"—అచ్చు ప్రతిపాఠముకంటె ప్రథమ

ప్రతిపాఠము సముచితముగ నున్నది. 147 వ పద్యమున "మునిముట్టిన మోహము" అని కలదు. ప్రథమప్రతిలో నున్న పాఠము 'తుదిముట్టిన మోహము". ఇది నుడికారము. అర్థవంతము కనుక, ప్రథమప్రతిపాఠమే సముచితము. 215 వ పద్యమున "కోడలు ప్రెక్కజన్ దిగిచి సుంగుచు నక్కునఁజేర్చి" అని కలదు. "ముసుగుఁ నుండఁగ" అనుపాఠాంతరము కు అనవసరము. కాని ప్రథమప్రతిలో నున్న పాఠము "కోడలు ప్రెక్కనంత కొసంగందఁగ నక్కునఁజేర్చి" — ఈ భావ ప్రకటనలోని సమధిక ధీసైశిత్యము, వ్యంగ్యమానము లగు కౌసల్య గాఢవేదన, సీతసౌకుమార్యము, త్రిశాపి కరుణరస కంపనము హృదయస్పందనము సహృదయ హృదయంగమములు.

ఇవి ప్రధానమైన పాఠాంతరములు. అముద్రితప్రతికిని ప్రథమప్రతికిని మాత్రము పాఠపరిశీలనము పరిమితము. ప్రథమప్రతికిని ద్వితీయప్రతికిని చూసె పాఠాంతరములు కలవు. ప్రకృతి విషయము. పాఠాంతరముల కంటె, పద్యగద్య సంఖ్యాభేదం పరిగణనముకంటె అవశ్యగమనార్హమైన అత్యపూర్వ విశేషము భాస్కరుని అయోధ్యాకాండ రచనా విధానమే.

## ఫలస్వామ్యము

భాస్కరుని అయోధ్యాకాండ రచనావిధానము, అముద్రితప్రతిలోని అయోధ్యాకాండ స్వరూపముకంటె, అత్యంతభిన్నమని అతిస్పష్టము. పద్యగద్యమాత్ర పరిగణనముకంటె, పాఠక్యము, పార్థక్యము కంటె కావ్యరచనా ప్రణాళిక గమనార్హము.

భాస్కరుని అయోధ్యాకాండమున కథావిధానము యథాయథలము కాదు. స్వతంత్రము. అముద్రితప్రతిలోని అయోధ్యాకాండమునందుగల అగమభాగములు- అనగా కుంచెలీకృతభాగములు చాలవరకు, యథాయథాలకథానకములు. (6 28 పద్యగద్యములు ద్వితీయసం; 86-61...చతుస్సర్గ; 66-61...పంచమసం, 65-71...పరము దశమసర్గలు......) అని చెప్పి, భాస్కరుని అయోధ్యాకాండమున యథాలోకము వాదములు లేవని కాదు. లేవని యథాతథా విధానము. స్వతంత్రమైన కావ్యరచనా ప్రణాళికను సంతరించిన

# భానుకర విక్రాంతి

శ్రీ కొమాండూరు కృష్ణమాచార్యులు

పురుహూత ద్విప కుంభపీఠములపై పొల్పారు సిందూరపుం
దెరలన్ లేతొగ రెక్కి నిక్కి యుదయాద్రిన్ ధాతురక్తాఘని
ర్ఝరులన్ దానములానె శోణరుచులన్ జంభారి దిక్కుంభిని
ధరమాళిన్ గనుపట్టు భాస్కరకరోద్యద్దీప్తి భావించెదన్.

పరిఫుల్లోజ్జ్వల హల్లకారుణరుచిప్రస్ఫీత భాస్వత్కర
స్థిరదీపుల్ బహుళాంధకార పటల చ్ఛేద ప్రదీపాంకురో
త్కరముల్ సర్వదిగంతరాళ యుగపద్వ్యాపారపారీణముల్
తరుణార్కద్యుతు లిచ్చుగాక శుభసంతానంబు లత్యన్తముల్!

ధ్వాంతాక్రాంత జగత్త్రయాంతర జనా స్వర్గాప్త సంతాన ని
ష్కాంతిన్ సర్వదిగంతరాళ విలసత్కార్యవ్వరాంబుచ్ఛటా
భ్రాంతిన్ గొల్పుచుఁ బూర్వదిక్తటగిరి ప్రాగ్భాగభాగాంబరా
క్రాంతిన్ శాంతివహించు భానుకరవిక్రాంతిన్ ప్రశంసించెదన్.

కమలాంతర్గత గర్భసీమల నుదగ్రగ్రావ తుంగాద్రులన్
సమరీతిన్ బడుచున్ ప్రభాతసమయాస్త ప్రాయకాలద్వయో
ద్గమ మేకాకృతి నొప్ప దీర్ఘగమనాధ్వక్రాంతి నూహ్యాత్రికే
కమునన్ బొల్పు సహస్రభానుకర విక్రాంతిన్ ప్రశంసించెదన్.

తిమిరానీలపటంబు జార విప్రతోద్విగ్నాంగులన్ బ్రాణులన్
రమణీయోజ్జ్వల సాంధ్యరాగరుచిరప్రస్ఫీతదిగ్వాంశుకం
తుము గూర్చాదశకాంచలాంశుకములన్ దోరంబుగాఁ గప్పు నా
కమలాప్తోదయ రాగదీపు లొసగున్ గల్యాణ సాకల్యమున్.

బాలార్కాంశు విఘట్టితార్కమణి నిర్యాతోజ్జ్వలత్పావక
జ్వాలాజాలసృతోద్గతుల్ శతమఖాశాశైలకూటస్థలిన్
లీలాసక్తత మాచరింప సముదాళిప్రాతవైతాళిక
వ్యాలోలాక్షి విలాసమున్ వలుపు భాస్వద్దీప్తి భావించెదన్.

స్ఫురదర్కద్యుతి పుంజ పీడితములై జ్యోతిర్లతా దీధితుల్
హరిణాంకోజ్జ్వలకౌముదిన్ దగ విదృశ్యాకారమై పోవఁగా
సగుణాత్రపలు క్షతజరుధిరచ్ఛాయావిలాశ్మచ్ఛలా
స్థిరకూటోదయ శైలశృంగ విలసద్దీప్తిన్ ప్రకాశించెడన్.

ఆతామ్రారుణదివ్యదీధితుల నుద్యద్భాను దీపాంకుర
వ్రాతంబుల్ నిబిడాంధకారముల జీల్పన్ కాందిశీకంబులై
ప్రీతిం దూరధరాధరోదరదరీ బృందంబులన్ ధ్వాంతసం
ఘాతంబుల్ రవిభిల్లభల్లహతులన్ గ్రైవాలుచందంబునన్.

పాపక్రాన్త నిజాంగసంగత మహావ్యాధిప్రకర్షావధి
వ్యాపారప్రవిలుప్త ఘ్రాణ నఖసర్వాంగీణ దుష్టవ్రణో
త్తాపార్త్యాశ్రిత మానవప్రతతి కుత్సాహంబు గల్పించు భా
రూప హాస్కర దివ్యదీధితి లసద్రూపంబు భావించెదన్.

పానందోత్థిత సిద్ధసంఘకృత సంధ్యావందనార్ఘ్యాంజలి
ధ్యానాద్యర్చనముల్ గ్రహింప నుదయాహార్యంబుపం దోచు నా
భాను ప్రస్ఫురదంశుపుల్ దిగిభకుంభస్ఫీతసిందూరముల్
నానా సౌఖ్యము లిచ్చుగాక జనతాన్తర్ధ్వాన్త సంహారులై!

దివసారంభమునందు వామనములై దేదీప్యమానాకృతిన్
దివియున్ భూమియు నాక్రమించి పరువన్ దిక్చక్రవాళాన్తర
వ్యవధానంబున నిండి యుద్ధతమహోదగ్రాసురాక్రాంతమా
భువనంబున్ బలిమిన్ గ్రహించు రవిదీప్తుల్ సౌఖ్యదం బయ్యెడున్.

అరుణాకృష్ణ ఖలీనకర్షణ నముద్యల్లోహితాకారమై
తురగాస్యంబుల దోచు నెయ్యవి సముత్తుంగాద్రికూటంబులన్
పరిఫుల్లోజ్జ్వల కింశుకప్రభలచే భాసిల్లు నా సూరసూ
తరుచిస్ఫీత నవార్కరక్తమృణిసంతానంబు భావించెదన్.

సమయాకృష్ట పయఃప్రపుష్ట జనతా సంభావ్యమానంబులై
యమితోగ్రాటవులందు గ్రుమ్మరుచు పాయాహ్నంబునం దీర్ఘ దు
ర్గమలీలన్ చరమాద్రిగోష్ఠమున జేరంబోవు తద్గోనిహా
గ్రసము లెవ్వాని యధీన మట్టి రవితేజస్స్ఫూర్తి గీర్తించెదన్.

[ఆంధ్రీకృత సూర్య శతకమునుండి]

# ధర్మవ్యాధుడు

'మంజీర'

అనేక మతకలహాలు వచ్చాయి. పోయాయి, ఏవో ఉప్పెనలా వరదలా వచ్చిపోయినట్లు. రాజకీయ నాయకుల ఉద్బోధలు, ప్రజల ఆవేశాలు, వాటి రక్తపాతాలు తీసుకవచ్చాయి. అలాంటివి వస్తూనే ఉంటాయి.

షేరాలీ యిలాంటి సంఘటనలు తన జీవితంలో చాలావాటిని ఎదుర్కొన్నాడు. ఆ పరిస్థితులలోను, వాతావరణంలోను ఎలా మసలుకోవాలో అలా మసలుకున్నాడు కూడా.

భారతదేశానికి స్వాతంత్ర్యంతో పాటు పాకిస్తాన్ కూడా వచ్చింది. దేశాన్ని ముక్కలుగా త్రుంచారు. అదీ చూశాడు.

దానికి సంబంధించి జరిగిన కల్లోలాలు, అమానుష చర్యలు కూడా చూశాడు. తన యింటిపక్కనే అన్యోన్యంగా నివసించే మాలకులు, వికటాట్టహాసాలు, గర్జనలు. ఏడ్పులు అన్నీ యింటితలుపు బిగించుకుని, వాటి సందుల్లోంచి ప్రత్యక్షంగా విన్నాడు. ప్రశాంతత ఏర్పడ్డాక, తనవాళ్ళు కలలుగంటూ, ఏదో తెలీని ఆనందం అనుభవిస్తూ, ఉన్న ఊరు, కట్టిన యిల్లు వదలి, ఎక్కడో ఏదో ఉందని పోవడం మౌనంగా చూశాడు. తన కన్న కూతురు, అల్లుడు వచ్చి సంతోషంతో నిండిన ముఖాలతో, ఎక్కడికో ఎందుకో పోదాం—రమ్మన్నప్పుడు, వాళ్ళ ముఖాల లోకి కూడా మూగగా చూశాడు.

తనకు ఎక్కువ మాటలు, చాలా చదువు రాకపోవడంవల్ల, వాళ్ళని ఏవిధంగా సముదాయించాలో తెలీక తికమకపడ్డాడు. హృదయంలోని ఆరాటం, బాధ, ఆవేదన, మాటలద్వారా వెళ్ళబుచ్చుకోడాని కశక్తుడయి కళ్ళలో తెలియపర్చాడు. తనకు తెలుసున్న రెండు మాటలుమాత్రం అనగల్గాడు, "ఉన్న ఊరు, కన్నకడుపు వదలలేనని."

అల్లుడు కోపగించి పెళ్ళాన్ని కసిరి మాట్లాడకుండా మూటముల్లె సర్దుకుని మారుబండికి ప్రయాణమై పోయాడు భార్యతో. నాటికీ నేటికీ అలివికోడవే తెలీదు, ఆరేళ్ళు గడిచినా. వాళ్ళువెళ్ళిన కొత్తలో ఉత్తరం ముక్క వస్తుందేమోనని ప్రతీ ఉదయం పోస్టు జవానుని కనుక్కునేవాడు. శాంతంగా, చల్లగా నవ్వుతూ జవాబిచ్చే ఆ పోస్టుజవాను ముఖంచూచి విచారం కొంత తగ్గించుకునేవాడు. బరువెక్కిన హృదయంతో యింటికి చేరుకునేవాడు.

ఇలా కొంతకాలం జరిగింది. కాలం గడచిన కొద్దీ మామూళ్ళు మారిపోతూంటాయి మనకు తెలీకుండానే. కష్టాల్లో కష్టాలగురించి బాధపడటం, కాస్త సుఖంగా కూర్చున్నప్పుడు కూతురుగురించి బాధపడటం మామూలయింది షేరాలీకి. రోజులు పోనుపోను ఏదో ఎప్పుడో విద్యుల్లతలా మనస్సులో మెరవడం, కాస్త కన్నులు చెమ్మగిల్లడం మామూలయింది.

షేరాలీ ఉన్న ఊరు పెద్దదీ కాదు. చిన్నదీ కాదు. రైలుబండి, ఎలక్ట్రిక్ దీపం, టెలిఫోను, తపాలాఫీసు, తాలూకాఫీసు, రేడియో, గుజరాతీ కొట్లు, మార్వాడీ బజారు, కార్మికులు, కాబూలీవాళ్ళూ ఉన్నారు. తన తండ్రి తాతలనుండి వచ్చే కసాయి పనిని నిర్వర్తిస్తూ గానుగెద్దులా లాక్కొస్తున్నాడు సంసారాన్ని. సంసారంలో ఉన్న సుఖము, జీవితంలో ఉన్న ఆనందం తప్ప మిగతావన్నీ అనుభవిస్తున్నాడు, ఆ రెంటికోసం భగవంతుణ్ణి గురించి తల్లకిందులా తపస్సుచేసే మహామునిలాగ.

తన జాతివాళ్ళు చాలామంది ఆ ఊరు ఖాళీ చేశారు. తనొక్కడే ఆ ఊరిచివర కాకిగూడులాంటి తన కొంపలో కాపురం చేస్తున్నాడు. వల్లమాలిన పిల్లలు, పెళ్ళాం, తల్లి, తండ్రి, బామ్మ తనతోపాటు ఆ సంసార సముద్రంలో పడి కొట్టుకుంటున్నారు. వంశంలో అనుక్రమంగా వచ్చే కసాయివృత్తి తప్ప తన తండ్రి తనకేమీ అప్పగించలేదు.

అతను తన తండ్రికి మాత్రం పేద ఆస్తి యేం సంక్రమించింది!

ఆ ఆస్తి సణుగూగొణుగూ లేకుండా అంగీకారయుక్తంగా తీసుకున్నాడు; గొర్రెలను, మేకలను పరిశీక కత్తి, కట్టమంగాను, అతని ఆస్తి. అలాగే అతని జీవితం గడుస్తూంది. చుట్టుపక్కలవాళ్ళకు యే విధంగానూ, కష్టం కలగజేయకుండా, తన పరిస్థితి, ఉన్న వాతావరణం, గ్రహించి మెలగడం నేర్చుకున్నాడు. ఇరుగు పొరుగులవాళ్ళు ఇతన్ని, ఇతని కుటుంబాన్ని మతాంతరుడనే భావంతో చూడడం లేదు కూడా. మామూలుగా ఇలాంటి విషయాలన్నీ ఆలోచించడానికి వాళ్ళకు తీరుబడి లేదు. అతను కూడా తమలో ఒకడే అయినట్లు తమ తమ పనుల్లో లీనమయ్యేవారు.

షేరాలీ మేకలను మేపడానికి తీసుకుపోయ్యేటప్పుడు, అవి జాలిగా పచ్చటి ఆకులు తింటున్నప్పుడు మాత్రం, కొందరు అతన్ని నిందిస్తూండేవారు. ఈ నిందలు ఒకటి రెండుసార్లు షేరాలీ విన్నాడు కూడా. ముఖ్యంగా తన యింటికి దగ్గర కాపురం ఉన్న అదే యింటి పంతులు ఇతని జీవహింసకు చాలా బాధపడేవాడు. మేకల అవస్థ చూచి చాలా జాలిపడేవాడు. షేరాలీకి వినిపించాలనే కాస్త గట్టిగా అవ్యపదేశంగా ఏవో నిందాభాషణాలు విసిరేవాడు. షేరాలీ ఈ గొడవలేం పట్టించుకొనేవాడుగాదు. తన పిల్లల కోసం, కుటుంబంకోసం తను ఆ పని చేయాల్సి తప్పదు. ఎంతమంది పంతుళ్ళు అరిచినా, అహింసావాదులు గోలచేసినా, మాంసాహారులున్నంతవరకు తనకా పని తప్పదు. అందుకే పంతులెంత అరిచినా యేం ప్రయోజనం లేకపోయేది. పాపం! పంతులు మేకలకోసం కరుణతో తొణికిసలాడిపోయేవాడు!

ఆరోజు షేరాలీ మాంసం అమ్మిన గంప భుజం మీద వేసుకుని సంతనుంచి యింటికి వస్తున్నాడు గతుకులదారంట.

సూర్యుడు చాలా వేడిగా ఉన్నాడు. కోపంతో అగ్ని కురుస్తున్నాడు 'స్టవ్'లోంచి వచ్చే జ్వాలల్లాగ.

అసలు దారంతా రాళ్ళమయం అవటంవల్ల, చెప్పులులేని షేరాలీ కాళ్ళు ఉడుకెత్తిపోతున్నాయి. ఏదయినా సూదియైన రాయి కాలికి గ్రుచ్చుకున్నప్పుడు మరీ అవస్థపడేవాడు. ఎంత అవస్థపడుతున్నా విసుగుకోకుండా శాంతంగా నడుచుకుపోతూన్నాడు. అదే యేమో అతనిలో విశేషం.

తన యింటిముంగిటకు వచ్చాడు. ఇంటిప్రక్క వేపచెట్టు నీడలో ఎవడో కుర్రాడు యేడుస్తూ నుంచున్నాడు. కొంచెందూరంగా ఉన్న యింట్లో మొగుడూ పెళ్లాలు దెబ్బలాడుకుంటున్నారు. ఇద్దరి గొంతుకలూ కూడా వినిపిస్తున్నాయి, సుస్పష్టంగా, భయంకరంగా ఎన్నికల ప్రచారం చేసే 'లౌడ్‌స్పీకర్ల' గొంతుకలాగ.

వాళ్ళు వాళ్ళ మనోవికారాల్లో తమ బాంధవ్యాన్ని, మానవత్వాన్ని, చుట్టూ ఉన్న ప్రజల్ని, అఖరుకి పుట్టి పెరిగిన జీవిత వాతావరణమే విస్మరించినట్లు కనపడుతూంది.

షేరాలీ తలెత్తి అటువైపు ఓసారి చూశాడు. మళ్ళీ తలదించుకుని ఇంటి గుమ్మంలోకివచ్చి తలుపు తట్టాడు. తలుపు తెరవడంతోనే గూట్లోనుంచి బయట పడిన కందిరీగల్లా, ఇద్దరుపిల్లలు విసురుగా పైకివచ్చి "బాబా, బాబా" అంటూ అతని రెండు కాళ్ళూ పట్టుకున్నారు. వాళ్ళిద్దరినీ వెంటబెట్టుకుని లోనికిపోయాడు.

వీధిలో దంపతుల కేకలు యింకా వినపడుతూనే యున్నాయి. ఆ కేకల మధ్యనుండి అప్పుడప్పుడు సన్నటి ధ్వని కూడా వెలువడుతూంది. షేరాలీ లోపలనుండి పైకివచ్చాడు. ఇంటిరాటలకు కట్టిన మేకపిల్లలు ఆకోలా చూస్తున్నాయి అతని వైపు. చెట్టుక్రింద కుర్రాడు అలా యేడుస్తూనే ఉన్నాడు. ఎదురుగుండా ఉన్న రెండు మూడు యిళ్ళ తలుపులు మూసుకొన్నాయి.

ఏడుస్తూ ఉన్న ఆ కుర్రాడివైపు షేరాలీ ఓసారి చూచాడు. వాడు ఆ వీధికి చెందినవాడు మాత్రం కాదని అతను గ్రహించాడు. దగ్గరిగా వెళ్ళాడు. కుర్రాడు ఏడుపు స్థాయిగా హెచ్చించాడు. షేరాలీ యేమడిగినా వాడిదగ్గరనుంచి యేడుపే సమాధానం. మరో మాటలేదు. ఏదో అర్థంలేని మాటలు చెబుతూ, బుజగిస్తూ ఇంట్లోకి తీసుకుపోయాడు. ఒక్కంతసేపు మాత్రమే ఇంట్లోనుండి ఆ కుర్రాడి యేడ్పు వినవచ్చింది.

షేరాలీ తనబట్టలు మార్చుకుని కుర్రాణ్ణి ఎత్తుకుని బయలుదేరాడు. ఆ కుర్రాడెవరో, ఏయింటో అతనికి ఏం తెలియదాయె. కొత్తగావచ్చిన ఆ ఉద్యోగస్థుని తాలూకేమో అనుకుని తిన్నగా అతనియింటికి

తీసుకపోయాడు. అతడు ముద్దొస్తున్న ఆ కుఱ్ఱాడి బుగ్గమీద ఓ చిటిక వేసి "మా తాలూకు కాదు" అంటూ సమాధానం యిచ్చాడు ముక్తసరిగా.

"ఎవరిపిల్లాడయి ఉంటాడు బాబూ?" అంటూ షేరాలీ అడిగాడు. ఏమి చెప్తే తనకేమి పని తగులుతుందో అనే బెంగతో, తనకు తెలీదని చెప్పి, ఇంట్లోకి పోయాడు. కొంత సహాయం చేస్తాడేమో నన్న ఆశతో కాబోలు షేరాలీ కాస్సేపు అచ్చట నిలబడ్డాడు. కాని యింట్లోకి పోయిన పెద్దమనిషి యిదేం పట్టించుకొన్నట్లు కనపడక పోవడంవల్ల, మళ్ళీ అక్కడినించి తన బరువైన పాదాలను మాదులాంటి చిన్న చిన్న రాళ్ళమీద వేసుకుంటూ వెళ్ళాడు. రెండు మూడు యిళ్ళ వాకబు చేసుకుంటూ వచ్చాడు. అందరూ ఒకటే ధోరణిలో ఉన్నారు. ఈ ప్రవర్తన అంతా షేరాలీకి విచిత్రంగా కనిపించింది.

ఎవరూ కూడా ఆ కుఱ్ఱాడు యెవరో, ఏమిటో అన్న ఆందోళనే కనపరచలేదు. ఇదంతా యింటి అరుగుమీద నిలబడి కళ్ళజోడు మధ్యనుంచి చూస్తున్న పంతులు "తీసికెళ్ళి పోలీసుస్టేషనుకు అప్పజెప్పవోయి సాయిబూ. ఎందుకు నీకి అనవసరపు శ్రమ. వాళ్ళే చేసుకుంటారు యీపనంతా" అన్నాడు.

షేరాలీ మాట్లాడకుండా ఆ కుఱ్ఱాణ్ణి తీసుకుని తనయాత్ర సాగిస్తున్నాడు. ఆ పిల్లాడు బెదురుగా అందరివైపు చూడడం తప్పితే, యింకేవిధమయిన సహాయం చేయలేకపోతున్నాడు. షేరాలీకి సందుమలుపు తిరిగి రెండిళ్ళు దాటాడు. షేరాలీ వెనకనుండి యిద్దరు స్త్రీలు "హరినారాయణా! ఎక్కడికి పోయావురా, బాబూ!" అంటూ పరిగెత్తుతూ వచ్చారు. షేరాలీ వెనక్కి తిరిగాడు. పిల్లాడుకూడా "అమ్మ" అంటూ ఒకామె మీదకు ఒరిగాడు. "ఈ పిల్లాడు మీవాడేనా"? అంటూ షేరాలీ వాడి బుగ్గ నిమురుతున్నాడు. మాట్లాడకుండా ఆ స్త్రీలు పిల్లాణ్ణి ఎత్తుకుని ముఖం మీద ముసుగులు ముందుకు లాగుకుని చల్లగా యింట్లోకి జారుకున్నారు.

షేరాలీ వెనుదిరిగి యింటిముఖం పట్టాడు. ఏదో ఆలోచిస్తూ యింటికి చేరాడు. అతని కోసం ఎదురు చూస్తున్న పిల్లలు "నాన్నా, నాన్నా" అంటూ వాకిట్లోనే అతన్ని చుట్టుముట్టారు. ఆనందంతో యిద్దరినీ చెరో చేత్తో పట్టుకుని యిటూ, అటూ ఊపుతూ షేరాలీ యింట్లోకిపోయి చతికిల బడ్డాడు. ఇంటిలో వాళ్ళంతా అతినిచుట్టూ చతికిలబడ్డారు.

కన్నాలుపడ్డ యింటి కప్పునుండి వెలుగు ప్రసాదిస్తున్నాడు సూర్యుడు. కోపులో, రోలకలో, యింటి మీద పెంకులు కనుపిస్తున్నాయి. ఎండగాడుపు దారుణంగా కొడుతూంది బయట.

"నాన్నా పండుక్కి బట్టలు తేవ్వా" అంది షేరాలీ కూతురు. ఏంపండుగన్నట్లు తలెత్తి చూశాడు. "రేపు రమ్జాను కాదా" అంది ఆపిల్ల ఆనందంగా. "అలాగా" అన్నాడు పిలలవైపు చూస్తూ.

తనకు పండుగని తెలీనందుకు చాలా ఆశ్చర్య పడ్డాడు. అప్పాట్లో తనవాళ్ళ నలుగురూ వున్నప్పుడు ఎంత ముందుగా పండుగ సంగతి తెలిసేది! ఎంత ఆనందంతో పండుగకొరకు వేచి ఉండేవాడో, కాస్త వెనుదిరిగి ఊహించుకున్నాడు.

"ఏం బట్టలు కొంటావు, నాన్నా?" అని మళ్ళీ వినిపించింది షేరాలీకి. పిల్లలంతా తలో వేపు మూగారు. కొడుకు అవస్థ గ్రహించిన ముసిలివాడు "ఉండుండర్రా, తెస్తాడు లెండి, సాయంత్రం" అంటూ ఒక కేక వేశాడు. పిలలంతా సింహగర్జనకి భయపడి పరుగెత్తే లేళ్ళలాగ చెల్లాచెదరయ్యారు

షేరాలీకి ఏం తేవాలో, ఎలా తేవాలో, యేమీ బోధపడలేదు. ఇంట్లో తిండి జరగడమే పెద్ద ఘనకార్యంలా ఉంది.

"పాపం, పిలలు వాళ్ళకేమి తెల్సు" అనుకున్నాడు మనస్సులో షేరాలీ.

"రేపేనా నాన్నా పండుగ. కొత్త బట్టలు లేకపోతే యెలాగ?" అన్నారు పిలలు మళ్ళీ దూరాన్నుంచే. బూబమ్మ ముసుగు కాస్త ముందుకు లాగింది.

"ఇంకెప్పుడు తెస్తావు నాన్నా? ఎప్పుడు కుడతారు?" అని కాస్త రాగధోరణిలోపడ్డారు.

"నాయనా, ఎలా ఓలాగ కాస్త చూడు మరి. పాపం పిలలు; యేం చేస్తాము." అన్నాడు ముసలివాడు తన దరిద్ర్యపు జీవితము అవలోకిస్తూ. షేరాలీకి ఏం చెయ్యాలో బోధపడలేదు. సరిగా ఊహించనైనా లేకపోతున్నాడు.

వీధిలోని మేకపిల్ల ఓసారి అరిచింది అయో మయంగా.

షేరాలీ బల్లగా మసితుండు గుడ్డ తలకు చుట్టుకుంటూ బయలుదేరాడు. ఇంట్లో వారంతా అతని వైపే చూస్తున్నారు. వీధిలోపడి ఏనుగులా అడుగులో అడుగు వేసుకుంటూ పోతున్నాడు ఆ యెండలో. ప్రబోక్యంపమయిన సుడిగాలి లేచింది. ప్రక్కనున్న చెత్త, ఎండిన ఆకులు ఓ పెద్ద సంధింలా, తిన్నగా ఆకాశంలోకి తీసుకుపోయింది. పరిసరప్రాంతమంతా ధూళితో నిండిపోయింది. ఆ జంఝామారుతం అలా ప్రయాణం చేస్తూ పోయింది. ఆ వాయువు బారినుండి బయటపడ్డ ఆకులన్నీ తిరుపాగా తిల్లక్రిందులవుతూ క్రిందికి దిగుతున్నాయి.

షేరాలీ నఖశిఖపర్యంతం ధూళితో నిండి పోయాడు. కళ్ళు నులుముకుంటూ నడుస్తున్నాడు. బజారులో ప్రవేశించాడు.

వడ్డీకి డబ్బుయిచ్చే పంజాబు సింహం, సర్దార్ షేర్ సింగ్ ఏవో చిట్టాలు సరిచూసుకుంటున్నాడు. రాసిన లెక్కలే రాస్తున్నాడు. ఓకంటితో దారంటపోయే వాళ్ళందరినీ చూస్తున్నాడు: హఠాత్తుగా తనవద్దకు వచ్చిన షేరాలీని చూడగానే చిన్న మందహాసం చేస్తూ,

"ఏమండోయి, నవాబుగారు! ఇలా దయ చేశారు." అన్నాడు.

"తమవద్దకే" అన్నాడు షేరాలీ ఓ సలాంకొట్టి.

"రండి.కూర్చోండి" అన్నాడు. మళ్ళీ చిట్టాల్లో నిమగ్నుడయ్యాడు.

"అయ్యా మీరు నాతో చెప్పారుగా" అన్నాడు షేరాలీ నీళ్ళు నములుతూ.

"అవునవును. ఏం?"

"ఏంలేదు. దాన్ని తమకిచ్చేద్దామని"

"మరి యివ్వనన్నావు కొడుకోయి."

"ఇచ్చేస్తాను బాబూ, తమకు కావలిస్తే"

"ఇప్పుడు నాకు ఆమేక అంత అవసరంలేదు. మరోటిబేరం చేసేశాను."

"అహా! అలాగా" అని ఊరుకున్నాడు షేరాలీ.

"ఇంకా పూర్తిగా కొనెయ్యలేదనుకో, బేరం మాత్రం అయింది."

"నా మేక చాలా మేలురకం అండి. ఓ మారికి మూడుపిల్లల్ని పెడుతుంది. పాలుకూడా బాగా ఇస్తుంది. తమకు వేరే చెప్పాలేమిటి లెండి"

"ఆలోచించడాని కేముందిగాని, ఎంతకిస్తావు?"

"తమ రిదివరలో యిస్తానన్న ధర ఇప్పించండి. కేవలం అమ్ముకుందా మనుకోలేదనుకోండి. ఏమి చెయ్యాలి. పరిస్థితులిలా వచ్చాయి!"

"ఇదిగో చూడు. అఫర్! అచేం, ఆ వేళ పోయాయి. పాతిక రూపాయలు యిస్తా. అంతకన్న ఎక్కువలేదు." అన్నాడు దృష్టంతా చిట్టలమీదే ఉంచి.

షేరాలీకి కాస్త కష్టం అనిపించింది. మనస్సులో బాధ, కోపం ఒక్కుమ్మడిగా వచ్చాయి. ఏమీ చెయ్యలేని తన అసహాయతకు చిహ్నంగా కళ్ళు చెమ్మగిల్లాయి.

"ఈ పదిరోజులకు ఇంత తేడాయేనా! కాస్త న్యాయం ఆలోచించండి."

"ఆలోచించడాని కేముందోయి. ఇదంతా వ్యాపారం, వ్యాపారం అంటేనే అంత. ఏరోజు ధర ఆరోజుదే. నీకు మరోపది ఎక్కువ యిస్తానంటే మవ్వ్యాగికే. పోనివ్వావూ?"

"అది కేడ్లో లేపో యీనుతుంది బాబూ. చాలా బాగా పాలుకూడా యిస్తుందండి. అలా కానివాడు మీ డబ్బుమీకిచ్చి నా మేకను నేతోలుకుపోతాను." అన్నాడు, షేరాలీ దైన్యంతో.

"అవన్నీ చూచుకునే పాతిక ఇస్తానంటూంట. అంతకంటె ఎక్కువ యెవరైనా యిస్తే అమ్ముకో వోయి పాపం!" అన్నాడు తేలికగా.

"అయిదురూపాయలు ఎక్కువ ఇప్పించండి చాలు."

"అబ్బే అంతకు ఎక్కువలేదు. తర్వాత నీ యిష్టం" అన్నాడు సర్దారుజీ.

"తమలాంటి గొప్పవాళ్ళకి యీ అయిదు రూపాయలు లెక్కేమిటి చెప్పండి, పదిరోజుల క్రితం తమరిస్తానన్నారుకదా ముప్పయి అయిదు రూపాయిలూను."

అడుగు వేశాడు. పడిపోయిన ఆకు ఏదో వినబడుతూ ఉన్నట్టు. చెట్టు క్రింద ఓ మునిలా పడుకుందో గుడ్డలమూట. మూటనుండి వినవస్తోంది మూలుగు హృదయాని కి తట్టుకట్టి లాగుతున్నట్టు.

"దీపం పట్టండి" అంటూ అరిచాడు. కూతురు దీపం పట్టుకొచ్చింది. ఏళ్ళతో వ్రేలాడుతున్న ముసలమ్మ కనిపించింది గుడ్డపీలికల మూటలమధ్య.

"ఏం మామ్మా — ఎవరునువ్వు?"

"షేరా!" అంటూ తెరిచింది ముసలిది కనులను! "షేరా ఎవరివి! నాకే తెలీదు. నాపురాని ముసలి దాన్ని అంతే!" అంది ఎత్తిన రెప్పల క్రిందికి వాలుస్తూ.

"నీకెవరూ లేరూ?"

"ఎవరూ లేరు. లేకేం! అంతా ఉన్నారు ఈ చెట్టు" అంది రొప్పుతో.

"ఇంకా ఎన్నాళ్ళో యీ పెరక బ్రతుకు. ఎవరు నాయినా నువ్వు? ఇంత ముసలితనంలో దిక్కు మొక్కూ యేదో యీబాధ" అంది.

ఆమెకు చుప్పు సోహ కందదు. ఆమెను ఏం చెయ్యాలో షేరాలీకి యేమీ తెలీటం లేదు. ఆమె అక్కడే స్పృహ తప్పిపోతూంది. ఆమె ఆ చెట్టు క్రింద ప్రాణాలు వదులుతుందేమోనని భయమేసింది. ఆ చెట్టు క్రింద చచ్చిపోతుంది! తనకళ్ళఎదుట, తన యింటప్రక్క. ఎలాగ ఊరుకోడం?

"జీవితపరిణామం ఇంతే కాబోలు!" అనుకున్నాడు లోలోపల.

"కాస్త తిండి పెట్టమంటావా? మామ్మా!" అన్నాడు.

"పోయే ప్రాణాలు నిలబడ్తాయి కా? ఎందుకు నాయనా నీకీబాధ! నన్ను చావనీయి" అని గొణిగింది.

"పోనీ మాయింటో ఉండిపో, యింకెంత కాలం బతుకుతావు. ఇలా బలవంతంగా చావడమెందుకు?" అన్నాడు ఆప్యాయంగా.

"మీకందరికీ ఎందుకు నాకోసం చుట్టడం. పోతాయీ — ప్రాణాలుపోనీ" అంది.

"మాయింటో ఉండిపో. ఆఖరు రోజుల్లో ఎందుకు నీకీబాధ" అన్నాడు మళ్ళీ. ఊరుకుంది ముసలిది.

షేరాలీ అలాగే నిలబడ్డాడు. చల్లగా వణికిస్తూ వీచింది గాలి. ముసలిది మళ్ళీ మూలిగింది.

"రా మామ్మ యింటోకి" అంటూ షేరాలీ కూతురు ముసలిదాని చెయ్యిపట్టుకుని లేవదీసింది.

షేరాలీ నిశ్చలంగా నిలబడ్డాడు.

రెండుగుణాల తరవాత "చూడు మామ్మా! నేను మాత్రం హిందూనిగాదు మరోలా అనుకోకేం" అన్నాడు సంకోచంతో.

"తిండి లేనివాళ్ళకు యీ గొడవలన్నీ ఎందుకు నాయినా! నువ్వే ఓ కొడుకివి" అంది వంగి అడుగు లేస్తూ ముసలిది.

షేరాలీ ఆ ముసలమ్మ చేతిని తన చేతిలోకి తీసుకొని మెల్లగా నడుస్తున్నాడు. ముందు దీపం చూపుతూ కూతురు నడుస్తూంది.

మేకలు దీనంగా అరుస్తున్నాయి. వేపచెట్టు ఊగుతూనే ఉంది, గాలితో కబుర్లాడుతూ.

"పాపం! మేకల గొంతులు కోస్తున్నాడు కాబోలు కసాయివాడు!" అనుకున్నారు ఎందరో మనస్సులో.

(హిందీ కథకు అనువాదం)

కాళిదాసు భాగ్యము, అది కాళిదాసు ప్రతిభ! ఆ ప్రాతిభ చక్షువునకుం దోఁచినది ఆ సందేశము పంపఁదగుట, అందులకు మేఘునుం గొనుట.

వాల్మీకి రాముఁడు వసంతము అతిక్రమించుచుండఁగా కాఁబోలు సీతం గోలుపోయి, ఆ యూపాత గుప్పతా విరహవేదనాశోకములం బొగిలి పొరలాడి ఉన్మత్త ప్రలాపములు ఆడియాడి, క్రమముగా హనుమత్సుగ్రీవులం గలసికొని సీతాన్వేషణమునకు వానరుల వెదకి నిశ్చయించుకొని శరదాగమముం బ్రతీక్షించుచు వర్షను గడుప మాల్యవంతముపై నివసించియుండెను. కావున ఇట నట్టి యున్మాదమునకు నుపలాపములకును ఆ శోకము మొక్కవోయి వేగము చాలకుండెను. 'శోకశ్చ మమవిస్తీర్ణః... రావణశ్చ మహాన్ శత్రుః...' అని రాముఁడు ఒక సుక్కలో అనుచుండెను; కాని వేగము అట్లు సీతాశూన్యాశ్రమముం జూచినది మొదలు జటాయువుం గాంచి నష్టి మెలుంగువరకు గుండెను ప్రీల్చునదిగాను ఉన్మత్త ప్రలాపముల కేఁచునదిగాను ఉండెనో—అన్నాడు భవభూతి యుత్తర రాముఁడును—

'ఉపాయానాం భావా దవిరత వినోదవ్యతికరై
విమర్దై ర్వీరాణాం జగతి జనితాత్యద్భుతరసః,
వియోగో ముగ్ధాక్ష్యాః సఖలు..............'

అని.

'ఇయాప్తా మన్మథవతాం హితాః ప్రతిహతా దిశః,
అనులిప్తా ఇవ ఘనై ర్నష్టగ్రహనిశాకరాః......'

అని 'మన్మథవతాం హితాః' అని వాల్మీకి మహాముని ఒకపాటి తున్నగా పలుకఁగా, మదనమర్మజ్ఞుఁడు కాళిదాసు

'మేఘాలోకే భవతి సుఖినోఽప్యన్యథావృత్తి చేతః
కంఠాశ్లేషప్రణయిని జనే కింపున ర్దూర సంస్థే!'

అనియు,

'అనేన పునః నిర్వృతాత్మా మప్యుత్కంఠా
కారిణా మేఘోదయేన అవస్థాంతరో భవిష్యతి'

అనియు తన లోకోత్తర సృష్టికి విక్రమోర్వశీయ చతుర్థాంకమునకును మేఘదూతమునకును విత్తనము నాటి మొలకెత్తించి పెంచి పూఁతయుం గాపును అట్లు సాధించినాఁడు. ఎంతేని వాల్మీకి కవితా సంస్కృతి మయిన కాళిదాసు మతిలో ఇదెల్ల నిజ ప్రతిభా ప్రథకమైన రామాయణవ్యాఖ్యానమే. తద్ర మాహాత్మ్యవకమాభ్యుపకరులను భవభూతి

'లక్ష్మణః—సోఽయం శైలః కకుభసురభి
ర్మాల్యవాన్ నామ యస్మిన్
నీలః స్నిగ్ధః శ్రయతి శిఖరం
నూతన స్తోయవాహః.
రామః—వత్సైతస్మా ద్విరమ విరమా
తః పరం నక్షమోఽస్మి
ప్రత్యావృత్తః పునరివ సమే
జానకీ విప్రయోగః'

అని ఉత్తరచరితమునను,

'లక్ష్మణః—కిం మఖిత ఏవ ప్రవృత్త పారప్లవ
మారుత వితన్యమాన చదర్పాని కాననాని సంత
తితి తాప్పపటలయా దృశా పరిక్షిప్య ధనురధ
ష్టమ్భధారిత శరీరేణ ఆర్యేణ సీయతే ?
రామః వత్స, కిం న పశ్యసి ?
......................
అపి చ విఘటమాన ప్రౌఢతాపిచ్ఛనీలః,
శ్రయతి శిఖర మద్రే ర్నూతన స్తోయవాహః'

అని వీరచరితమునను,

'ఘర్మాంభో విగమాగమ వ్యతికర
శ్రీవాహినో వాసరాః
......................
శ్రయతి శిఖర మద్రే ర్నూతన స్తోయవాహః
......................
'భగవన్, జీమూత,
దైవా త్పశ్యే ర్జగతి విచరన్
మత్ప్రియాం మాలతీం చేత్'

అని మాలవ మేఘమును దానికి సందేశము చేతోడంగి మాలతీ మాధవమునను,

ఆట్టె మురారిపండితుఁడును ఆ మాల్యవంతము కడనే రాముని చేత

'అభినవఘనవ్యూహ్యాఘోరస్థః ప్రవర్తతి మాల్యవాన్'
'వత్స, లక్ష్మణ, ధారయమామ్'. న శక్నో
మి స్తమ్భయితు మాత్మానం'

అని అనర్ఘరాఘవమునను, ఆ తొలి మేఘపు దెబ్బను తాఁకఁజాలమిం జెప్పించి ప్రకటించినారు.

ఇంక విక్రమోర్వశీయమున ఆ యతిమారపుఁ గొండమీఁది యడవులలో ఊర్వశిం గోలుపోయి వెందురు

వ్యక్తసహాయః కృతే వీర స త్త్వయుక్త కృవిక్రమః
సుగ్రీవస్య చ సన్దేశః సిద్ధిం కథయతీవ మే."

అని. అంతే. ఇది యున్మత్త ప్రలాపమునుం గాదు. మఱియు రామగిరిం జెప్పి, కవి యక్షుఁడు రాముఁడే యనియు, యక్షి సీతయే యనియు, ఇది వాల్మీకి చెప్పి యుండవలసినది, చెప్పక తప్పిపోయినది. ఈ సరస సందేశము రామాయణమున యీరుఁగాయనకు చేసి చెప్పి సేవింతునని విపుల విపులముగా ధ్వన్యమును సూచించినాఁడు. ఉత్తరమేఘము ధ్యాయిష్ఠముగా సుందరకాండకు హనుమత్సీతా సమాగమ సంభాషణల యావృత్తియే. మేఘసందేశము ఎట్టి యున్మత్త ప్రలాపమో మల్లినాథ సూరిగారు ఒండొకెడ దెలియఁజెప్పినారు. నైషధము చతుర్థ సర్గలోని అరువదవ శ్లోకము.

"పరుషకర కురు మేకము యోరాఘునం
జహి రితో ముకురం చ మృగాపవ్య మే;
విశతి తత్ర యదైవ విధు సదా
సఖి, సుఖా విహితం జహి తన్ప్రుతమ్."
[ప్రాణసఖులార, వెన్నెల బయలికి పురు
మించుటద్దంబుఁ గొలయుఁ గొంచు రండు;
చొరఁ డల చంద్రుఁ డదింబు సొచ్చినపుడు
బంధనము లేక (వేయుఁడీ పొంచియుండి]
శ్రీ. నై. II 124

"..................అత్ర చంద్రోపహారాది ప్రలాపాః మేఘసందేశాదివ న్మదనోన్మాద వికారా ఇత్యనుసన్ధేయం........" —జీవాతువు.

ఎండవడకు వాడినలోకమునకు, వానకై వాచి పోవుచున్న దానికి, తొలకరి మేఘమువలన ఎట్టి యాప్యాయనమో, దాని వానవలన అందు గిరికి పడికి కానకు తోటకు జనపదమునకు నగరమునకు ఎట్టి ఉచ్ఛ్వాసమో, ఎట్టి సుఖమో, ఉఱుములతో మెఱుపులతో తుంపురుగాలులతో ఆ వానసరియుచున్నప్పటియు వెలిసినప్పటియు లోకమున దాన నదెట్టి సౌభాగ్యమో, మేఘదేవునికిని గిరిరాజులకు జలదను, నాయకునికి నదీనాయికలకు అదెట్టి సమాగమమో, కాళిదాసు విరహోన్మత్త యక్షునిచే మేఘునికి దారి చెప్పించు వ్యాజమున పూర్వమేఘమున మఱియే కవికిని అందని భంగిని చెప్పినాఁడు.

"కశ్చిత్కాన్తా విరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః
శాపేనా స్తంగమితమహిమా వర్షభోగ్యేణ భర్తుః"

'స్వాధికారాత్ ప్రమత్తః' — యక్షుఁడు తన కొలువులో అశ్రద్ధ చేసినాఁడు. అందులకు కారణము కాంతాతిమాత్రాసక్తి కాఁబోలును. కాంతను ఎడఁబాసి యుండవలసినట్లు శాపము. దానిని వర్షభోగ్యము చేయుట అన్ని ఋతువుల విభవభోగములను ఒకమాఱే కొలుపుద్యుటకు. అధికార ప్రమాదమునకు దండనయైన శాపము చండితుని ఆట్టి కాంతా లౌల్యమువలన దిద్దలదా? మఱి యక్షుఁడు ఇట్లు కాంతం దలంచుకొనియే యున్మత్తుఁడై యుల్లాసం దొడంగినాఁడే! శాపము అసలు వర్షమాత్ర భోగ్యము. అందు ఇంకను శేషము నాలుగు మాసములే. అంతట కాంతం గలసికొనునే కలసికొనఁడా? ఆ పాటికి అట్లు కనకవలయభ్రంశ రిక్త ప్రకోష్ఠుఁడై ఇంకను ఇంత యేడ్చి ఈ సందేశారంభము చేయు నేల?—అని యడుగుదురు. శాపాంతమున ఒకవేళ ఇంక అధికారములో ప్రమాదపడక మెలఁగుచు వహింపనే వహించును. వినను రాగము మాని సన్న్యసించునా? శాపకాలమున అనతిదీర్ఘమునను ధీరతమాని ఇట్లు అతఁడు కుములుట న్యాయ్యము యనఁదగును. యక్షులు దేవయోని విశేషము. అలకయు స్వర్గముం బోలె దిక్పాలకుని రాజధాని, దేవతల నెలవు, ఏకాంత భోగస్థానము. వారికి సర్వకాల సర్వావస్థలయందును భోగపరాయణతయే; ఇంద్రియ నిగ్రహము ఇంచుకయు అలవాటు లేదు. అలకను వర్ణించునపుడు యక్షుఁ డొక్కొక్క శ్లోకమునను ఒక్కొక్క తెఱఁగు కామక్రీడనో, కాంతలం గూడిన పాన గోష్ఠినో, వారితోడి తోఁటల విహారమునో, వారి జిహ్మాలంకార విలాస విభ్రమ పరతనో, ఆటపాటలనో, 'పటసీమ' క్రీడనో, ఆలింగనాంగ గ్లానులనో, అభిసారికా యాతాయాతములనో, కాంతలు కాంతుల వలపించు దూపుల చాతుర్యమునో కలవరించును గాని, మఱియొండు కలవరముం గనఁడు. తనయింటను మంచి తోఁట, మరకతములయు బంగరు తామరలయు హంసలయు బావి, ఇంద్రనీల క్రీడాశైలము, అశోక కేసరములతోడి కురవకకృత మాధవీమండపము, పెంపుడు నెమలి, శారిక, సాటిలేని యందగత్తె, చిత్రకర్మ నాట్యము వీణె పాటయు ఎఱిఁగిన రసికురాలు నగు తన ప్రియురాలు. ఇవెల్ల ఒక సంవత్సర

# గ్రహ కక్ష్యాక్రమమందలి విశిష్టత

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

ఖగోళమందలి తారాగ్రహము లన్నియు నిరవధిక మైన విశాలాకాశరంగమున పరమాత్మప్రతినిధియై, సృష్టిస్థితి లయములకు కారకుడైన సూర్యభగవానుని చుట్టు చుట్టి, వలయాకారముగా భిన్న భిన్న కక్ష్యలలో, నిర్విరామ నిస్తంద్ర దీక్షతో తిరుగుచున్నవి కదా? ఆ కక్ష్యాక్రమ సంవిధానములో నొక్క విశేష మున్నది. గ్రహములలో నెల్ల సూర్యమండలమునకు అతి సన్నిహితముగా సంచరించుచుండు గ్రహము బుధుడు. ఈశ్వరసంకల్పానుసారముగా, కర్మానుభవముకొరకు ప్రపంచయాత్ర చేయుమని బూని, సూర్యమండలమును వెలువడివచ్చిన జీవులకు బాహ్య ప్రపంచమందలి పరిస్థితులను తెలుసుకొనుటకు వలయు బుద్ధిని సమకూర్చుటకై సృష్టికర్త నిర్మించిన మొదటి సౌకర్య మీ బుధమండలము. ఈ మండలమును ప్రవేశించి పరిస్థితులను అర్థము చేసుకొను తెలివిని సంపాదించుకొన్న తరువాత, ఆ పరిస్థితులతో సంతోషానుభవమునకు సామరస్యమును అలవరచుకొని కలసి మెలసి ప్రవర్తించు నేర్పు లేనిచో, జీవులు బుధమండలమునందు సంపాదించిన విజ్ఞానమునకు ప్రయోజనము లేదు. ఆ కారణమున, సామరస్యమును, సంతోషమును సాధించు చాకచక్యము నిచ్చు శుక్రుని కక్ష్య బుధ కక్ష్యకు వెలుపల నిర్మింపబడినది. ఈ బుధ శుక్ర మండలములలోని సామగ్రిని స్వీకరించిన తరువాతనే, జీవులకు వసతియోగ్యమగు కర్మభూమిని సృష్టికర్త ప్రసాదించియుండుట. నానావిధ విషయములను గ్రహించి, సామరస్యముతో వానిని స్వీకరించి, జ్ఞప్తిలో నుంచుకొని, మననము చేసి, కర్తవ్యము నాలోచించు నైపుణ్య మునిచ్చు మనఃకారకుడు చంద్రుడు భూమండలమునకు అంటిబాయని ఉపగ్రహముగా ఏర్పరచుట సృష్టికర్త అనుగ్రహము. బుధ శుక్ర కక్ష్యల తరువాత భూకక్ష్య నిర్మింపబడుటకు ఉపపత్తి ఇది.

భూలోకమందలి మానవులకు బుద్ధి, సామరస్య సంపాదనచాతుర్యము, ఆలోచనా శక్తి, అను మూడుగుణములు మాత్ర మున్నచో, కార్యసాధనమునకు చాలునా? అనుభవించుటకు ఉపయోగించు పరికరములను ఆకృతి పరచుకొనుట కొరకై నానా విధములైన పరిశ్రమ సల్పుట అవసరము. ఆ పరిశ్రమకు సత్త్వము, ధారణ, పరాక్రమము, కావలసియున్నవి. అందుచే, భూకక్ష్యకు వెలుపల, అంగారకుడు లోనే, భూపుత్రుడు పరాక్రమశాలి కుజుని కక్ష్య ఏర్పరచబడినది. విజ్ఞానము గ్రహించి సుఖానుభవము కొరకు పరికరములను సంపాదించుటకై పరాక్రమించు మానవులకు, వారిపరిశ్రమ వ్యర్థము కాకుండ, సత్కర్మాభివృద్ధిని సమకూర్చు సంకల్పముతో, కుజకక్ష్యకు తరువాత ప్రబల శుభగ్రహ మగు బృహస్పతి కక్ష్య నెలకొల్పబడియున్నది. కాని ఇన్ని సౌకర్యములు నిరుపాధికముగా అబ్బినపుడు, మానవుల శక్తి సామర్థ్యములు అపరిమితములై, హద్దుమీరి, విశృంఖలముగా పెరుగు సంభవ మున్నది కదా! కనుక, వానిని నియమబద్ధములుగా చేసి, వాని వ్యాప్తికి అవధి కల్పించుట సృష్టికర్తకు అత్యంతావశ్యకమైనది. ఈ దృష్టితోనే, అభ్యుదయకారకుడగు బృహస్పతి కక్ష్యకు తరువాత, సంకోచకారకుడగు శనియొక్క కక్ష్యను సృష్టికర్త నిర్మించుట.

మన ప్రాచీనులకు వాడుకలో నుండిన సప్తగ్రహము లివే. వీనిలో భూకక్ష్యా వలయమునకు లోపల శుక్ర, బుధ, రవులు, వెలుపలి వైపున కుజ, గురు, శనులును, కలరు. బాల్యములో విద్యాభ్యాసంగము, యౌవనమందు విషయసుఖలాలసత, పూర్వవయస్సున శృంగార వీరరసరంగములలో పరాక్రమించు ప్రాగల్భ్యము, మధ్యవయస్సున ధర్మార్థముల అభివృద్ధి, వార్ధకమున విరక్తితో సర్వసంగ పరిత్యాగము, అను పద్ధతితో, సృష్టికర్త మానవ జీవితములకు నిర్ణయించిన వ్యూహక్రమ మిది యని, పై గ్రహ కక్ష్యానిర్మాణక్రమము సూచించుచున్నది కదా?

"శైశవే భ్యస్త విద్యానాం
యౌవనే విషయైషిణాం,
వార్ధకే మునివృత్తీనాం
యోగే నాంతే తనుత్యజామ్."

అని రఘువంశపు రాజులను గూర్చి మహాకవి కాళి దాసు చేసిన వర్ణనము పెక్కంశములను సూత్రప్రాయముగా నిర్వచించుచున్నది. అది యట్లుండె.

పై ఉపపత్తిని గమనించినచో, మన నవగ్రహములకు పరిమితమైనవని తేలును. అనగా సామాన్య దృష్టితో కార్యకారణ సమన్వయము చేసినపుడు ఊహింపరానంతటి గొప్ప ఫలము, మంచిదైనా, చెడ్డదైనా, ఈ గ్రహములనుండి కలుగదనుట. ఇటనుటచేత ఈ గ్రహములు నిస్సారములని, వానికి శక్తి అల్పమని, నా ఆశయము కాదు. వానికి వాస్తవముగా గొప్పదే అగును. కాని, అది యథేచ్ఛముగా, నిరంకుశముగా, వ్యాపించి తన ప్రభావమును వ్యక్తము చేయుటకు వీలు లేనట్లుగా, శని మహాశయుడు దుర్భేద్యమగు గొప్ప మంచుకోటను నిర్మించి కావలి కాచియున్నాడు. గ్రహరాజగు రవికి ఈశని పుత్రుడు కాదా? రాజపుత్రుని ఆజ్ఞను ధిక్కరించుటకు సాధ్యమా?

కాని, ఈశని కక్ష్యాప్రాకారమునకు వెలుపల వరుణుడు, ఇంద్రుడు, యముడు అని వ్యవహరింపబడు గ్రహములు మూడు ఉన్నవని చదువరులు ఎరుంగుదురు. శని మంచుకోటకు వెలుపల నున్న కారణమున, వీనికి ప్రసారమునకు, ఇతర గ్రహములకు ఉన్నట్లు, ప్రతిబంధక సామగ్రి లేదు. అందుచే, ఈ గ్రహముల సామర్థ్యము అపరిమితమైనది. సామాన్యముగా, ఊహాతీతమైనది వానిశక్తి. బుధుని బుద్ధిని వరుణుడో వైశాలినిగా ప్రజ్ఞగా, అనగా ఉపజ్ఞాయుతమగు ప్రతిభగా మార్చగల మహాప్రభావ సంపన్నుడు వరుణుడు. శాస్త్రీయ పరిశోధనముల కేమి, యోగసాధనముల కేమి, విరించికి రాజకీయాధికారనిర్వహణమున కేమి ఎంతో తగినది యీ వరుణ ప్రభావము. భక్తియందు కాని, రక్తియందు కాని, లలితకళాసక్తియందు కాని, ఏకాగ్రతగల మనోలయమును చేకూర్చి, శుక్రుడు ప్రసాదించు సామాన్యసుఖమును అనంతబ్రహ్మానందముగా మార్చు యోగ్యత ఇంద్రునికి కలదు. రాగులకు, యోగులకు, భోగులకు, కవులకు, గాయకులకు, నటీనటులకు ఇంద్రుని అనుగ్రహము అమూల్యమైనది. కుజాని

సామర్థ్యమును అపారముగా అభివృద్ధిపరచి, దానిని సమయానుసారముగా లయమునకైనా, పునఃసృష్టికైనా ఉపయోగించుటకై యమునిది. శని కక్ష్యకు వెలుపల నుండునవి ఈ గ్రహముల కక్ష్యలు. కనుకనే, ఇతర గ్రహముల కార్యములతో పోల్చినచో, వీనికి అప్రమేయముగా చూపట్టగలదు.

సామాన్యముగా, మానవులకు యీ శనివలయమును తప్పించుకొని బైటికి ప్రసరించదు. కనుకనే, శనిగ్రహమును ఆయుష్కారకుడని, మారకులలో అగ్రేసరుడని, మన ప్రాచీనులు నిర్వచించిరి. ఆపేర కాలుడు ఎవడైనా ప్రయత్నించినా, అలుసాతో పోనిచ్చువాడు కాడు శని. ముప్పుతిప్పలు పెట్టి, వానితో మూడుపుటకల నీరు త్రావింపగలడు. కావుననే, శనిపేరు విన్నచో మనవారికి చాలా భయము.

కాని, ఏ భాగ్యవదు గ్రహములవలనో, కొందరు వ్యక్తులకు ఆ మంచుకోటను దాటి బైటపడుచున్నది. అప్పుడు నిరంకుశముగా, అశ్చర్యకరముగా వ్యక్తము కాగలదు. విశ్వామిత్రుడు, గౌతమబుద్ధుడు, శంకరాచార్యుడు, ఛత్రపతి శివాజీ, ఝాన్సీ లక్ష్మీబాయి, మొదలగు అసాధారణ వ్యక్తులట్టివారు. వారి జన్మకాలములో శనికక్ష్యకు వెలుపల నున్న గ్రహములకు ప్రాధాన్యము వచ్చియుండు ననుటకు సందేహము లేదు. ఇట్టివారిలో, జర్మనీదేశపు హిట్లరు అట్టివాడు. అతని జాతకమున లగ్నమందలి శనునికి కేవలము దశలో చలిత కుజ రవుల ప్రబల మైత్రి ఏ కాలములో కూడియుండుటయే, రెండవ ప్రపంచ సంగ్రామములో అతడట్లు విక్రమించి విజృంభించుట!

సాధారణముగా, జాతక కేంద్రములలో భావ ముఖ్యమునకు సన్నిహితమైతే, ఇతర గ్రహములతో సమాగమము దృష్టిసంబంధము మొదలగు సౌకర్యములు అబ్బినపుడు తప్ప, ఈ గ్రహములు తమ ప్రభావమును స్పష్టముగా చూపవు. చూపగలితే మాత్రము, మంచికైనా, చెడ్డకైనా, వాని శక్తి నిరుపమానము. దాని వ్యాప్తికి మేర యుండదు. సామాన్యముగా అసంభవమని తోచునట్టి, కార్యకారణ సమన్వయమునకు అందనట్టి, అశ్చర్యకరమైన గొప్ప సత్ఫలమైనా, గొప్ప దుష్ఫలమైనా, వ్యక్తి జీవితములలో అగుపడెనేని, అప్పుడు ఈ నూతన

గ్రహముల చేయివాడితనము తప్పక చూపట వని మనము విశ్వసించవచ్చును.

ఈ విళంబి సంవత్సర చైత్రమాసమున వెలవడిన ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో, నవగ్రహ ప్రభావమును తెలుపు ఉదాహరణ మొక్కటి ఆంధ్ర మహాశయులకు నివేదించియుంటిని. మరియొక చిన్న దృష్టాంతమును ఇచట విన్నవింతును.

1978 వ సంవత్సరమున జూన్ నెల 12 వ తేది రాత్రి 7-34 p. m. (IST) గంటలలో ఒకడు, 8 26 p. m. (IST) గంటలలో మరియొకడు, కవలలు జనించిరి. వారిలో రెండవ వ్యక్తికి నిరయనముగా రాశి, నవాంశ చక్రము లిట్లుండును:—

| | | | |
|---|---|---|---|
| శ | | ర | రా కు<br>శు బు |
| | (నిరయన)<br>రాశి<br>కుండలి | | గు |
| | | | |
| కే<br>లగ్న | చ | | |

| | | | |
|---|---|---|---|
| | కు బు | | శు |
| | (నిరయన)<br>నవాంశ<br>కుండలి | | చ<br>కే |
| రా | | | |
| గు | లగ్న<br>శని | | ర |

ఈ కవలలో మొదటి వానికి సయితము పై రాశి కుండలి అన్వయించగలదు. నవాంశచక్రములో మాత్రము ద్వితీయుని లగ్నము వృశ్చికాంశ అగుచుండగా, ప్రథముని లగ్నము సింహాంశ అగుచున్నది. ఇతర విషయములలో వ్యత్యాసము లేదు.

వింశోత్తరీ దశాపద్ధతిలో, ఇరువురికి జన్మకాలమున గురుమహాదశయే జరుగుచుండినది. దశాశేషము, ప్రథమునికి ఆరు నెలలు, 14 దినములు మాత్రమే; ద్వితీయునికి 18 నెలలు, 20 దినములగుచున్నది.*

ఈ కవలు మధ్యమకక్ష్యకు చెందిన గౌరవనీయ భూస్వాముల కుటుంబమున జనించినవారు. బాల్యావస్థ తీరకమునుపే, జనకుని కోలుపోయిన ఈ కవలను సమర్థురాలగు తల్లి, కష్టపడి పెంచినది. ఇరువదిమూడు వసంతములు దాటినవో, లేదో, వీరిరువురికిని, ఒకే దినమున, వివాహ మహోత్సవములు జరిగినవి. పాఠశాలలో విద్యార్థులుగా కాలక్షేప మేమో బాగుగనే జరుగుచు వచ్చినది. కాని వ్యాసంగము తిన్నగ యుండుటవలననో, సహవాసదోషము కారణముగనో, వీరికి విద్యలో తగిన ప్రాయ రాలేదు. అర్ధానుస్వార వ్యాసంగము వీరిది. పరీక్షలలో పూర్ణానుస్వారము ఫలము కాని, వ్యాసంగము తప్ప ఇతరవిషయములలో, అనగా, ఆటపాటలు, వ్యాయామపరిశ్రమలు, వినోద విహారములు, సాంఘిక సభావేశములు, ఇత్యాదులలో, తగినంతచొరవ, చాకచక్యము కలవారగు కారణమున, ఏదోవిధముగా, ఉపాధ్యాయులు వీనిని క్రిందితరగతుల నుండి పైతరగతులకు క్రమముగా పాగించుకొనుచు వచ్చినారు. ఇట్లుండగా, పసువారు సంవత్సరముల వయస్సు వచ్చిన కొన్ని నెలలకే ప్రథమునికి, భాగ్యము

* కృతికి "జ్యోతిర్గణిత" సంప్రదాయము ననుసరించి సాధించిన అయనాంశములవలన వచ్చిన ఫలితమిది. భిన్నపద్ధతుల నుపయోగించువారికి నిరయన చంద్రస్థానములో, భాగలో, కళలో, మారిపోవుట సహజము. అందుచే, జన్మకాల దశాశేషము సయితము వ్యత్యాస మగుట వింతకాదు. కొన్ని పరిస్థితులలో, నక్షత్రమే మారవచ్చును. ఏ పద్ధతి సాధువో, భగవంతుని కెరుక; నిరయనపద్ధతిలో ఇప్పుడున్న గొప్ప అవ్యవస్థ ఇది!

పంపి, భార్య కాపురమునకు వచ్చి వ్యాసంగమునకు వేఱుత్రోవ చూపినది. "పర్వతానాం శోభనం." అందుకు కదా ?

ఒకటి, రెండు, దండయాత్ర లయినా, మెట్రిక్యులేషన్ పరీక్షలో విజయము సంపాదించుటకు ద్వితీయునికైనా సాధ్యము కాలేదు. కాని, పరీక్షలో కల్గిన అపజయమునుగురించి, అతడించుకంత అయినా చింతించినవాడు కాడట! పరీక్షలో నెగ్గుటకు, ప్రపంచయాత్ర సాగించుటకు, పరస్పర సంబంధమేల అవసరమో, అతనికి బోధపడినదికాదు. అతని కాలము విశ్రాంతిగా గడచిపోవుచుండినది.

ఇటి పరిస్థితులలో, అతనికి పందొమ్మిదవ ఏట, ఒక ఆకస్మిక సంఘటనము కలిగినది. ఆ గ్రామపు విద్యాధిపుడొక గొప్ప రైలువే ఉద్యోగి, కలకత్తా నగరమునందుండువాడు, ఏదో కార్యవశమున స్వగ్రామమునకు వచ్చియుండగా, లోకాభిరామాయణముగా అతనితో మాటలాడుచుండిన ఆయూరి ఉపాధ్యాయుడొక నియోగాలి ప్రభావశీలుడైన జాతకుని మాట ఎత్తి అతనిని వెంటకొనిపోయి జీవనోపాయము చూపమని ఆ ఉద్యోగితో చెప్పుటయూ, కానిమ్మని అతడంగీకారమును సూచించుటయూ, అమరుదినమే అతనివెంట జాతకుడు కలకత్తానగరమును చేరుకొనుటయూ, తలవని తలంపుగా జరిగిన కథ! తరువాత కొన్నాళ్ళలో నె, ఆంగ్లేయుల యాజమాన్యములో నున్న ఒకానొక గొప్ప వ్యాపార సంస్థలో కలకత్తానగరమందే, నెలకు ఏబదిరూప్యముల వేతనములభించు చిన్న ఉద్యోగమొకదానిని ఆ మహనీయుడు జాతకునికి సంపాదించి ఇచ్చి పుణ్యము కట్టుకున్నాడు. దీనితో జాతకుని జీవితములో గొప్పమార్పు వచ్చినది. తనయోగ్యత ఎంతటిదో, అతనికిఇపుడర్థమైనది. ఆ సంస్థలో పనిచేయువారనేకులు. వారిలో వేరు వేరు యోగ్యతలు గల వ్యక్తులు, ఏబది మొదలుకొని ఐదు వేల రూప్యముల వేతనము ఆర్జించు వారుండిరి. తోడి వారితో పోటీచేసి నెగ్గుట ఆవశ్యకమని అతనికి తోచి గొప్ప సంచలనము కలినది. కనుక, నియమిత కార్యములు తృప్తికరముగా చేసి, యజమానుల మెప్పును సంపాదించనిదే తనకు జీవితములో అభివృద్ధి రాదని అతడిపుడు గ్రహించగలిగెను. రేయింబగళ్లు అతిదీక్షతో పరిశ్రమ సలుపుచు, ఉద్యోగాభివృద్ధికి ఏ ఏ విషయములలో విజ్ఞానము అవసరమో, అది అంతయు క్రమముగా పట్టుదలతో సాధించి నేర్చుకొని, కార్యమునైనా వెనుకంజవేయక చేయుచు వచ్చుటచే కొన్ని సంవత్సరములలో నె, ఆ సంస్థలో పనిచేయుచుండిన కొందరు విద్యాధికులకంటె ఉన్నతస్థాయిలోని ఉద్యోగములను అందుకొనగలిగినాడు జాతకుడు. ముప్పది అయిదు వత్సరములు వచ్చునప్పటికి, అదే సంస్థలో నె అతనికి గొప్ప అధికారముగల పదవి లభించినది. సంస్థా వ్యవస్థాపకులకు అచ్చుమెచ్చుగా ఉద్యోగధర్మమును నిర్వహించుటచే, దాదాపు వేయి రూప్యముల వేతనమును సంపాదించుచు, సత్సంతానముగల గృహస్థుడుగా, జాతకుడు హాయిగా కాలమును వెళ్ళబుచ్చుచున్నాడు.

ఇక, అతని అగ్రజునికథ వేరు. దాంపత్య జీవితములో రుచి లభించి, అతను వ్యాసంగమునకు స్వస్తి చెప్పినవాడుకదా! ఇంటిపట్టున నిలుచుట కారణముగా, కుటుంబపు ఆస్తిపాస్తుల పైన ఇతనికి యాజమాన్యము వచ్చినది. ప్రాచీన సంస్కారపు చేష్టములలో పెరిగినది అతని నవోఢ నవనవాభిరుచుల కొరకు ఉవ్విళ్ళూరు రసికుడై తిరుగును. అతను కోరినంత పారవశ్యము స్వీయాసంగం ఇతనికి లభించినది కాదు. ప్రణయార్థులగు పరకీయలతోనో, సందుగొందుల సాహచర్యంతోనో, ఇతని రసికతకు కాలక్షేపము జరుగుచు వచ్చినది. వివేకము పెడదారి బట్టుటచే, దుర్వ్యసనము అధికమై, ఆర్థికస్థితి నానాటికి పలుచబారి, ప్రాచీనమగు భూస్థితి క్రమక్రమముగా, విక్రయాదులవలన పరులపాలగుచు వచ్చెను. ముప్పదియారు వర్షములు వచ్చునప్పటికి, సోదరుని ప్రసక్తి లేకుండ, ఇతడే యావదాస్తిని నామావశిష్టముగ చేసినాడు. తరువాత, మూడు సంవత్సరములకే, ఇహలోకమున జీవితము చాలించుకొన్నాడితడు.

ప్రశంసలో నున్న కవలజీవితములు, ఏ విషయములో కాని, పరస్పర సామ్యము లేనివి. నేర్చిన విద్య, ఇంచుమించుగా, సమానమే; పెంపకములో వ్యత్యాసము లేదు; పెరిగిన పరిస్థితులు సహా భేదము లేనివి, అయినా, వీరి జీవిత మార్గములలో హస్తిమశకాంతర తారతమ్యమున్నది. వీరి నిరయనరాశి నవాంశకుండలులలో ఏ యోగము ఈ వ్యత్యాసమును చూపగలదో, ఊహించుట కష్టము.

మారిన గ్రహములు పయిరీతి చూపబడిన సాయన జాతకచక్రములను ఒక్కసారి పరిశీలింతము.

పతియై, యోగప్రదుడైన శుక్రుని సమసప్తక దృష్టితో ప్రేరేపించి, యోగమునిప్పించి, జాతకుని అభివృద్ధికి తెచ్చినాడు వరుణుడు. సరేకాని, మైత్రిమీద అతనిస్వభావము, అతని విషమదృష్టి ఫలము, జాతకునికి కలిగిన సమష్టి పరిణామములలో చేరియేయున్నవని సహృదయులు గమనించగలరు.

ఇంద్ర కుజబుధులపైన సహా వరుణుని సమసప్తక వేధయున్నదికదా! ఈ వేధ యీ రెండుజాతకములకును సమానమే. సామాన్యముగా, ఈ వేధ మోసము, ద్రోహము, స్పర్ధ, ప్రతిబంధకసామగ్రి, మున్నగువానిని తెలుపునట్టిది. తిమ్మనికి వరుణుడు, లగ్నమందుండుటచే, వైయక్తికజీవితమునందెంతటి ప్రాపంచికముగా అభివృద్ధి కనుడైనాడుకదా! విద్యతక్కువ అయినా, తనను మించి ఈ అవ్యక్తేశుడు ప్రోత్సహించుచున్నాడేయని, అసూయాగ్రస్తులగు తోడివారి కుతంత్రములు, స్పర్ధలు, అపవాదములు, మొదలగు చిక్కులను జాతకుడు జాగరూకతతో ఎదుర్కొనక తీరలేదు. సప్తమ శుక్రుడు ఉత్తమ మిత్రులను సూచించగా, సప్తమకుజాదులు ప్రబల ప్రతికక్షుల సూచించగలరు. వారిపైనున్న వరుణ విషమదృష్టి ఈ రూపముతో తిమ్మనికి ఫలించినది. అన్న లగ్నమందలి కేతువు శీలచ్యుతిని, నీచ సాంగత్యమును చేకూర్పగా, ఆ మార్గములలో సహజముగా వచ్చు పట్టి కష్టములు, ద్రోహములు, విరోధములు, మొదలగు పరిస్థితుల రూపముగా అతని జీవితమున వరుణవేధ చూపట్టినది.

వరుణగ్రహవేధమున స్వాతంత్ర్య కాంక్ష, వ్యధికరణ శీలత, అతివాదిత్వము, దురభిమానము, హాస్యము, మొదలగు స్వభావములు రావలయును కదా! అవి ఏమైనవి? అనవచ్చును. ఏమి కాగలవు! అన్నియు వీరి స్వభావములలో నున్నవి. ఏ గ్రహఫలము అయినా, ఇతరగ్రహయోగముల ఫలములతో మిళితమైన వ్యక్తము కాగలదు కాని, ప్రత్యేకముగా, విడి వారి చేసినట్లు, చూపట్టుట అసంభవము. వరుణుడు చూపిన అభివృద్ధి మార్గములలో, కేతువు సూచించిన పతనములలో ఈ ఫలము చేరియుండగలదు. ఉద్యోగకార్యనిర్వహణ విషయమున తోడివారి అభిప్రాయములు సరుకు చేయని అతి స్వాతంత్ర్య బుద్ధి తిమ్మనిది. వారి ఊహలకంటె తన అభిప్రాయములే సాధువులు, యుక్తియుక్తములు, అను అభిమానము అతనికి కలదు. ఆరోగ్యమును, గృహకృత్యములను, నిరాదరించి అయినా, ఉద్యోగధర్మమును నిర్వహించి తీరవలయునెడి హఠమతనిది. అతి పరిశ్రమమున ఆరోగ్యము చెడిపోయినా, ఎందరు బోధించినా, విశ్రాంతిని, చికిత్సను, నిరాదరించునట్టి వ్యధికరణస్వభావమున్నది. తాను అదృష్టశాలి అని, తనజీవితములో అన్నియు అదృష్టదేవత స్వయముగా నడుపుచున్నదని మానవుల పురుషకారము గమ్యకైనా కారగాదని, ఉపన్యసించు సందర్భమున ఇతడు కేవలము అతివాదియే! కాని, కాల మొక్కతీరుగా నుండదని అతనికి తోచదు. గ్రహగతులు మారును. అదృష్టము సహా తారుమారగును.

ఇక, ఇతని అగ్రజున్నడున్నాడో, నీతి నియమ నిరాకరణములలో నిరంకుశాధికారి. తలి, కుటుంబము, సంఘము, మున్నగువారి విషయముగా తన బాధ్యతను గమనించక స్వేచ్ఛా ప్రవర్తనములలో నుండెను. ఆరోగ్యమును, ఆర్థికస్థితిని, గమనించని కామ స్వాతంత్ర్యములో అతివాదిత్వమున్నది. తలి కాని, భార్య కాని, తన ప్రవర్తనమును తప్పుపట్టుట ఓర్వని దురభిమానము కలదు. జనాపవాదమును, ఇంటి గౌరవమును సహా, సరకుచేయని వ్యధికరణ స్వభావమతనిది. సోదరుని హక్కును నిర్లక్ష్యము చేసి, పిత్రార్జితమును పేరు లేకుండ చేయుట అతని తలబిరుసుతనమును తెలుపును.

జాతకపు సామాన్యస్వభావము ననుసరించి వేరువేరు స్వరూపములతో, వేరువేరు రంగములలో, వరుణవేధఫలము వ్యక్తమైనది. కావుననే,

"ఆకృతి, జాతి, ప్రకృతిః,
జ్ఞాత్వా సమ్యక్ ఫలాని వక్తవ్యం,
కుల, శీల, వయోనుగుణం,
దశాక్రమశ్చైర్యథాన్యాయం."

అని పృథుయశస్సు హెచ్చరించుట.

ఇంత చాలు. జాతకములలో ప్రాధాన్యము వహించినప్పుడు, యోగప్రదగ్రహముల సంబంధము లభించినతో, ఈ నూతనగ్రహములు ప్రాచీన గ్రహముల ఫలములకంటె విశిష్టములగు అసాధారణ ఫలముల నిచ్చు ప్రభావములవని, పై దృష్టాంతములవలన, పాఠక మహాశయులు గమనించగలరు.

---

## సవరణ

1958 డిసెంబరు నెల 'భారతి'లోని "జాతకహితా పరీక్షము" అనువ్యాసములో ఈక్రింది సవరణలు చేసుకొనగల రని పాఠకమహాశయులకు మనవి:—

| పుట. | పంక్తి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 50-1 | ... 27 | శ్రీమతా ... | సగ్రీమ |
| -3 | ... 33 | క్షేశము ... | క్లేశము |
| | ... 4 | ... | ... |
| 51. 2 | [చిత్రముక్రింద] | వినతి ... | వసతి |
| 52-1 | ... 3 | దోషము ... | రోషము |
| | 24 | మటటు ... | గుట్టము |
| 53-1 | ... 8 | శనియు ... | ఐనియు |
| 54-1 | ... 16 | త్యాగము | స్వార్థత్యాగము. |

రా. గో. కృ.

దిగిన 'పర్సనాలిటీ ట్రెయిట్స్' అన్నీ సాధించాడు.. వాడి సాధన మెట్లలో వర్ధ్యరేఖలుగా వుండేది. కాని చివరికి వాడిపట్టుదల, సీరియస్ నెస్ చూచి అందరూ ఊరుకున్నారు...ధర్మశాస్త్రి చెప్పిన మూడువిధాలైన మానవుల్లో ఉత్తమ శ్రేణికి చెంది, అందులోకూడా ప్రథముడుగా వుంటాడు ప్రకాశం!

ఇల్లు చక్కగావుంది. డ్రాయింగ్ రూమూ, ఫర్నిచర్, కర్టెన్లు ప్రకాశానికి మంచి "టేస్టు" వుందనికాదు, బాగా డబ్బుకూడా వుందని ప్రచారం చేస్తున్నాయి. విద్యార్థిగా వుండేటప్పుడు అనవసరపు దర్జాలకు డబ్బు పాడుచేసేవాడు కాడు ప్రకాశం— అంటే, స్నేహితులు పదిమందికీ తరచు పార్టీలివ్వటం, ప్రెజెంటేషన్లివ్వటం, ఎక్స్‌కర్షన్సుకి సొంతఖర్చుమీద వాళ్ళని తీసుకువెళ్ళటం లాంటివి—ఏది అవసరమైనా దానికి లెక్క వేసి, కొరత లేకుండా ఖర్చుపెట్టేవాడు...ఇప్పుడు వాని యిల్లు చూస్తే అందులోని వస్తుసముదాయంకూడా ఆ గుణాన్నే జ్ఞాపకం తెచ్చింది.

ఇల్లు చేరుకున్న కాస్సేపటికే తన భార్య 'సరోజ'నీ, ఆమె చెల్లెలు 'రేణుక'నీ—ఇంట్లోవున్న ఆ ఇద్దరు ఆడవాళ్ళనీ తీసుకొచ్చి పరిచయం చేశాడు. వాళ్లు నమస్కారాలు పెట్టి తప్పుకున్నతర్వాత, ప్రాత విషయాలు, క్రొత్త సంగతులు ఎడతెరిపి లేకుండా మాట్లాడేశాడు ప్రకాశం......

"ఏమోయ్ నా పెళ్ళికి రాకుండా చాల డిసప్పాయింట్ చేశావ్! పోనీ, ఇప్పుడు చెప్పు నీ అభిప్రాయం! నాకు తగ్గ భార్యనే పెళ్ళాడానంటావా?"

కాస్త ఆలోచించాను; చాల సున్నితమైన విషయం మరి:

"నీ 'పర్సనాలిటీ ట్రెయిట్స్'కి తగ్గ 'ట్రెయిట్స్' ఆమెకున్నాయో, లేదో నాకు తెలీదుగాని, నా అభిప్రాయం: ఆమె తనకంటె మహాఅందగాణ్ణి మాత్రం పెళ్ళిచేసుకోలేదు!" అన్నాను.

"చచ్చాం బో! నీ డొంకతిరుగుడు ఇంకా మానలేదన్నమాట...సూటిప్రశ్నకు సూటిసమాధానం చెప్పి ఏడవటం ఎప్పుడూ లేదు!...ఇంతకూ నా మారేజీ నీ విమర్శకు నిలుస్తుందా, లేదా? చెప్పు."

"ఓకే, సెంట్ పర్సెంట్ మార్కులు వచ్చాయి."

భోజనమైన తర్వాత నా పనిమీద నేను బయలుదేరాను. "నువ్వొస్తావనీ, నీతో సరదాగా మాట్లాడాలని సెలవుపెట్టి ఇంట్లో కూర్చుంటే, మళ్ళీ సాయంత్రం దాకా రానంటున్నావ్!' అని అసంతృప్తిని వెలిబుచ్చాడు ప్రకాశం.

"దానికేం! ఇవాళ సాయంత్రంనించీ రేప్రొద్దుట మళ్ళీ యీవేళదాకా నీ స్వాధీనములోనే వుంటాలే!"

"రేపుకూడా వుండవేమిటి యోగానంద్?"

"ఇవాళ పూర్తైతే రేపు ఖాళీయే."

సాయంత్రం అయిదింటికి, నేను తిరిగి వచ్చేటప్పటికి, ప్రకాశం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. నా గౌరవార్థం ఒక చిన్న సైజు టీపార్టీ సిద్ధంచేశాడు—అంటే మరేంలేదు; టీ సెట్లు వగయిరాలతో నేనూ, ప్రకాశం, సరోజా, రేణుకా సోఫాల్లో కూర్చున్నాం. పనికుర్రాడు అన్నీ అందించాడు. గృహిణి హోదాలో సరోజ టీ కలిపి కప్పుల్లో పోస్తున్నది.

టీ త్రాగటం పూర్తి కావచ్చింది. అంతసేపూ ప్రకాశంఒక్కడే మాట్లాడుతున్నాడు. ఆడవాళ్ళిద్దరూ ఏదోలాగా, వినుకుంటూ మా యెదుట కూర్చున్నారని గ్రహించాను. సరోజ తన కర్తవ్యంలో పూర్తిగా మునిగిపోయింది...రేణుక వాళ్ళక్కయ్య వైపు తిప్పిన కళ్ళు మరల్చలేదు.

"నువ్వు...ఎప్పుడు చేసుకుంటావోయ్, పెళ్ళి? మమ్మల్ని పిలవొద్దు...ఎలాగూ రాము!" అన్నాడు ప్రకాశం.

"నీ యిష్టం!"

"నా యిష్టమేమిటి నీ పెళ్ళికి..." సరోజ, రేణుక నవ్వగా..."చెప్పు, ఎప్పుడు చేసుకుంటావో!" అన్నాడు ప్రకాశం. నాకు కోపం వచ్చింది. వాళ్ళూ నేనూ కొత్తగా కలుస్తూవుంటే, వాళ్ళముందర తన తెలివి ప్రదర్శనా గొప్పకోసం నన్ను కవ్వించటం దేనికి వీడు!

"బహుశా చేసుకోను!" అనేశాను తొక్కాను.

ఆ జవాబుకి అక్కా చెల్లెలిద్దరూ నావైపు కుతూహలంగా చూశారు...సూటిగా...

"ఎందుకని?...ఈమధ్య మారిపోతున్నావే!"

"ఆఁ... పెళ్ళిచేసుకోను. ఒక అమాయకురాల్ని కష్టపెట్టటం నాచేతకాదు, అందుకని..."

రేణుక చిరునవ్వు, సరోజ భర్తవైపు చూసిన చూపు, గమనించాను.

భార్యకి ప్రథమపాఠం, ఆ తర్వాత స్నేహితుడు! ప్రకాశం దీన్ని తారుమారు చేస్తున్నాడేమిటి?

రెండోరోజు భోజనసమయంలోను, యింత రాత్రికూడా సరోజ అన్నీ సవ్యంగా అమర్చింది... ప్రకాశం అదేకం కాలేదు!

పనులన్నీ పూర్తిచేసుకొని ఆ సాయంత్రం నేను యిలు చేరుకునేటప్పటికి ప్రకాశం సినిమాప్రోగ్రాం వేశాడు. సినిమాహాలు వాళ్ళింటికి దగ్గరే—ఓ ఫర్లాంగు దూరం వుంటుంది. నడిచే వెళ్ళాము. బాల్కనీ సీట్లు—నా ప్రక్కన ప్రకాశం, తర్వాత సరోజా, రేణుకా కూర్చున్నారు. జలపాతంలా వుండిన ప్రకాశం మాటల ఉరవడి అప్పటికి తగుముఖం పట్టింది — తగ్గటమే కాదు, సాయంత్రంనుంచీ పరధ్యానంగా కూడా కనిపించాడు... నాకు కొంత ఊపిరి తీసుకునే అవకాశం లభించింది.... తర్వాత పిక్చరు ప్రారంభం కావటంతో అందులో నిమగ్నులమయ్యాం... ఒక గంట గడిచింది. అప్పటికి సుమారు మూడోవంతు పిక్చరు అయివుంటుంది... ప్రకాశం నావైపు వంగి "తలనొప్పిగా వుందోయ్" అని మెల్లగా అన్నాడు. నా ఇదివరకే కుర్చీలో అటుయిటు మెదులుతూ వుండటం నేను గమనించాను... "పోతుందిలే!" అన్నాను. కొన్ని నిముషాల తర్వాత వాడు మళ్ళీ "నేను యింటికి వెళతాను, మీరందరూ పిక్చరు చూచి రండి" అన్నాడు నాతో.

నేను మళ్ళీ మాటాడే అంతలోనే అటువైపు తిరిగి సరోజతో కూడా ఆమాటే చెప్పటం విన్నాను.

"మేమూ వస్తాం...వెళ్ళిపోదాం పదండి" అంటున్నది సరోజ.

"వద్దు...మీరు వుండి చూచి రావాలి" అని ప్రకాశం నావైపు తిరిగాడు.

"అదేమిటోయ్! అందరం వెళ్దాం!" అన్నాను.

"ఏం లేదులే, వెళ్ళివిశ్రాంతిగా పడుకుంటాను... మీరు వుండండి" అంటూ చివాలున లేచి థియేటరునుంచి వెళ్ళిపోయాడు ప్రకాశం.

నాకేం తోచలేదు...ఒకవైపు తెరమీదజరిగే కథని అనుసరిస్తూ నేవున్నా, మనస్సు వెనకాల ఏదో అసంతృప్తిగా, సందిగ్ధంగా వుంది. కొంతసేపైన తర్వాత సరోజతో "ఏమండీ, మనం కూడా వెళ్ళిపోదామా!" అన్నాను.

"వద్దులెండి...ఆయనకు కోపంవస్తుంది" అన్నదామె.

సుమారు అరగంట గడిచినతర్వాత యింటర్వెల్ యిచ్చారు. సరోజ తలవంచుకుని భారంగా కూర్చోవటం చూశాను...ఆమె చెంపమీద కన్నీటిచుక్క వెలుగులో తళుక్కు మన్నది... నా హృదయాన్ని కలచివేసినట్లయింది...ప్రకాశం యింత మూర్ఖుడేమిటి!... ఈ అమ్మాయి యింత మెత్తనిదేమిటి!

మళ్ళీ పిక్చరు ప్రారంభించారు. "ఏమమ్మా! నాకు కూర్చోవాలని లేదు ... ఇంటికి వెళ్దాం!... ప్రకాశానికి సమాధానం చెప్పటం నావంతు" అంటూ సరోజ సమాధానంకోసం చూడకుండా లేచి యివతలికి వచ్చేశాను. వాళ్ళుకూడా వచ్చారు...దారిలో ఎవరూ మాట్లాడలేదు... నేను ముందూ వాళ్ళు వెనకా నడుస్తూంటే నాకు విచిత్రంగా తోచింది అసన్నివేశం...ప్రకాశం చేసిందానికి నవ్వాలో ఏడవాలో తెలీలేదు!

పడుకుని ఏదో పత్రిక తిరగేస్తున్నాడు ప్రకాశం...తలనొప్పి తగ్గిందట...కాని భోజనం అక్కరలేదట...సరోజను పిలిచి నాకు వడ్డించమన్నాడు... ఆ రాత్రి పడుకుంటూ "ఇహ ప్రకాశానికి అతిథిగా మాత్రం ఎన్నడూ రాకూడదు!" అనుకున్నాను.

## 2

ఏడెనిమిదిమాసాల తర్వాత నాకు మూడు వందల జీతంమీద ఒక ఇంగ్లీషు కంపెనీలో ఉద్యోగం దొరికింది. తర్వాత కొన్నాళ్ళకే పెళ్ళి సంబంధం చూశామని మా నాన్నగారు వుత్తరం వ్రాశారు. ప్రేమ వివాహాల్లో నాకట్టే నమ్మకం లేదు. ప్రేమ వివాహం! కంటె వైవాహిక ప్రేమ ప్రధానమని నా అభిప్రాయం. అమ్మాయిని చూడటానికి నన్ను తీసుకు వెళ్లారు. తీరా చూస్తే ఎవరో కాదు, రేణుక!...... ప్రకాశం మరదలు రేణుక!...నా 'రొమాన్సు' ఎనిమిది నెలల క్రితమే ప్రారంభమైందని చెప్పుకోవటానికి అవకాశంకూడా వుందన్నమాట! రేణుకను పెళ్లి చేసుకోవడానికి అంగీకరించాను...విచిత్రమేమిటంటే ఇందులో ప్రకాశంప్రోత్సాహం ఏమీ లేకపోవటం. మేము ఉత్తరాలు వ్రాసుకొని మూడు నెలలు కావస్తుంది. నా ఉద్యోగం సంగతి కూడా వాడికింకా తెలుపలేదు. వెంటనే ఉత్తరం వ్రాశాను.

బడేవారు) Medieval lyrics, Tribe and Ben, ఆధ్యాత్మిక (Metaphysical) కవులు, (Cavalier) కెవలీయర్ కవిత్వము, మతసంబంధమైన (Mystery) నాటకాలు, Tudor, Restoration, Elizabethan' Jacobean నాటకాలు, సర్ థామస్ బ్రౌన్, బర్టన్, (Sir Thomas Browne, Burton.) అడిసన్ స్టీల్ రొమాంటిక్ (Addission Steel Romantic) వ్యాసకర్తలు, కవులు, విక్టోరియన్ (Prophet) లు, ఇవన్నీ మా విద్యావస్తువులు ఇవన్నీ వివరించిన గ్రంథాలు పేరిగిపోయేవి. ఒకపుస్తకం రెండయ్యేది. ఈ పాఠ్య ప్రణాళిక తర్వాత సంస్కృతిపై ప్రత్యేకాభిలాషగల ప్రతి విద్యార్థి ఉన్నత విద్యాభ్యాసం కొఱకు ప్రయత్నిస్తూ ఉండేవాడు. వీలైనంతవరకూ ఆంగ్ల సాహిత్యానికి సంబంధించిన ఒక ప్రత్యేకదశ పరిశోధించడానికి చూసేవారు. ఈ అభిలాష లేని వారికికూడా ఆంగ్లసాహిత్యంలో శిక్షణ ఉండనే ఉన్నదికదా.

కాని ఈనాడు ఈ ప్రణాళిక రోజురోజుకీ తగ్గుతున్నది. ఒకప్పుడు కళాశాలల శిక్షణానికి ప్రాణప్రాయంగా ఉండే ఆంగ్లసాహిత్యానుశీలన మునుపటి ఉన్నత స్థితిలో లేదు. హైస్కూళ్లలో ఇంగ్లీషు పాఠ్యపుస్తకాలు లేనేలేవు—Shakespeare కు కూడా స్థానం లేకుండా పోతున్నది.

అంటే అన్ని కళాశాలలు ఈలాగే ఉన్నాయని కాదు. ఇప్పటికీ కొన్ని Graduate పాఠశాలల ప్రణాళికలలో ఇంగ్లీషు సాహిత్యము అగ్రస్థానాన్ని ఆక్రమిస్తున్నది. కాని పాతిక సంవత్సరాలకు పూర్వమిూ సాహిత్యంపై ఉన్నంత అభిమానం నేడు లేదు. సాహిత్యంమీద ఆస్థ ఉన్నప్పటికీ విద్యకు, విద్యార్థులకు నేడున్న సంబంధం వేరు. మునుపున్న స్వాస్థ్యం ఆసక్తి, భక్తి లేవు.

ఈ పరిస్థితి కొన్ని దుష్ఫలితాలకు దారితీస్తుందని నా అభిప్రాయం. ఈ దుష్ఫలితా లెటువంటివో చివరికి చెబుతాను. కేవలమొక కదలికను కలిగించడానికి తప్ప ఈ ధోరణి మరలించాలనే ప్రయత్నంలో నేను మాట్లాడడంలేదు. ఒక విధంగా ఈ ధోరణి మంచిదనీ, అవసరమైనదనీ కూడా, నా అభిప్రాయం సంస్కృతికి సంబంధించిన ప్రతి విషయంలోనూ మంచీ చెడూ కలిసే ఉంటాయని తెలిపే దుష్ఫలితా లంటున్నాను—అలవోకగా ఏదీ రాదుకదా! మరొక విషయం: ఈ ధోరణిని మనమసలు మరలించలేము. దీనిని నడిపే శక్తులు మరీ ప్రబలమైనవి.

ఈ శక్తులెటువంటివో చెబుతున్నాను. మొదట సాహిత్యానుశీలనపై రాజకీయాల ప్రభావాన్ని చర్చించాలి. సంస్కృతికి రాజకీయాలకు పరస్పర సంబంధం చాలా ఉన్నది. నేడీ సంబంధం ఇంకా ఎక్కువ. సంస్కృతికీ రాజకీయాలకు ప్రత్యేకంగా ముడిపెట్టబడుతున్నది; ప్రతి రాయబార కార్యాలయానికీ సాంస్కృతిక శాఖ ఉన్నది; ప్రపంచ విజ్ఞానసమితి ప్రతిదేశ సమున్నతికీ సేవచేయ పూనుకుంటున్నది; సంస్కృతికి సంబంధించిన విషయాలలో అగ్రస్థానంలోనే గౌరవించబడుతున్నది. అయితే ఇది ఇటీవలే సుమండీ! అటువంటప్పుడు మన విూసత్యాన్ని ఒప్పుకొని తీరాలి. 1930 ప్రాంతాలలో అతివాదుల (Radicals) భావాలే మన ఆయుధాలనేవారు: ఈనాడు స్వాభిమానులైన అధికారులందరు (Belles letters) సారస్వతమే ఆయుధాలుగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.

రాజకీయాలు మాట్లాడినప్పుడు కుండ బద్దలు కొట్టినట్టు మాట్లాడాలి. ఆంగ్లదేశ సాహిత్యానుశీలన తగ్గుతున్నదంటే ఆదేశం వెనకబడటమే ముఖ్య కారణమని చెప్పాలి. ఇంగ్లాండు ఘనతమంటే ఆదేశపు సాహిత్యాన్ని, అమెరికాలో అభ్యసించాలని నొక్కి చెప్పవచ్చు. అంటే ఈ ఉత్సాహంలో రాజకీయభావం కలిపి ఉన్నదని కాదు. గొప్పదేశాల సంస్కృతిపై ప్రత్యేకాభిలాష ఉండటం సహజం. అంతగా ప్రతిభావంతములు కానిదేశాల విషయంలో ఇంతగా కౌతుకం లేకపోవడం ఇంకా సహజం. దీనికి కారణాలు స్వాభావికమైనవి కావచ్చు, బాహ్యమైనవి కావచ్చును. ఆదేశము, ధనితత్వతా భావము ఒకదేశపు జాతి సాహిత్యం ద్వారా వ్యక్తీకరించడం జరుగుతుంది. అటువంటి సాహిత్యానికి కొత్తదైన కాంతిపరివేషం ఏర్పడుతుంది.

ఎలిజబెతన్ (Elizabethan) ఆ నేమాటలో కొన్ని సంవత్సరాల క్రితం ఎంతటుత్సాహం వెల్లివిరిసేది! "అది సాహసికమయిన భావాలతో మనసోహాని నింపి వేసేది—ఆంగ్ల సాహిత్యమంటే ఇష్టం లేకపోవడం బ్రతుకులో ఒక విస్మారాన్ని చూపించడమే అనిపిం

ఒకటి ఉన్నదనే జాతీయతాభావం కలగాలని నేను నమ్ముతున్నాను. ఈ విషయంగురించి ముందొకసారి చర్చించాను—సిగ్మండ్ ఫ్రాయిడ్ను (Sigmund Freud) గూర్చి మాట్లాడినప్పుడు, Freud శైశవానికి అర్థవానికి విషయాల్లో సంభవించిన కష్టాలను ఎనుకొంటూనే సామర్థ్యానికీ, అతని విద్యాభ్యాసంలోని కొన్ని అంశాలు కారణమని చెప్పాను. అది ఒక పూర్వకాలపు లభ్యవస్తు; అభిజాతిమైనది. అతని శైశవ మనస్సులో 'పరోక్ష సంస్కృతి' ప్రతిరూపొందింది. ప్రాచీన కాలాలకు చెందిన ఈ అద్భుతమైన సంస్కృతిని పాఠశాలవిద్యార్థులు, ఉపాధ్యాయులు, పండితులు, కవులు మాత్రమే ఊహించగలుగుతారు. ఫ్రాయిడ్ (Freud) కి ఉండే అధిపత్యమునుగురించి చర్చించాను. ఇంగ్లాండుపైనా, ఆదేశపు సాహిత్యంపైనా అతనికి ఉండే ప్రేమ విశదీకరించాను. ఉదారమైన వ్యాసాలు గ్రీసును ఏవిధంగా గౌరవించేవో అదేవిధంగా ఇతను ఇంగ్లాండును గౌరవించేవాడు—అంటే నైతికమైన కారణములవల్ల. ఇంగ్లాండు ఇంగ్లీషుకవులలో విలువ పెంచే ఇతనికి ప్రత్యేకాభిమానం. షేక్స్పియర్, క్రామ్‌వెల్‌లు ఈ దేశానికి చెందినవారు: అందుచేతనే ఇంతటి గౌరవము.

గ్రీసుదేశపు సంస్కృతికి యూరోపియన్లపై ఒక వ్యాపించే నైతికాధిపత్యం ప్రస్తుతపరిస్థితులలో లేదు. 19 వ శతాబ్దపు ఫ్రాయిడ్కు ఇంగ్లాండ్ దేశపు సంస్కృతి ఉన్న సాన్నిహిత్యం 20 వ శతాబ్దపు అమెరికన్ విద్యార్థులకు ఉండదు. కాని 'పరోక్ష సంస్కృతి" ఉన్నదనే జాగరూకత పారస్పరి పరిక్రియకు చాలా ముఖ్యం.

ప్రప్రథమంగా ఈ ప్రాముఖ్యం బుద్ధిప్రధానమైనది (Intellectual). సుదూరదేశ కాలాలలోని జీవితమును భావించగలిగే శక్తి మించిన శిక్షణ బుద్ధికి వేరే లేదు. [ఆ కాలంలో] ఏవిధంగా చెప్పేవారో, [అప్పుడు] [అక్కడ] ఏవిధంగా భావించేవారో—ఇది అంతా కేవలం చరిత్రకు సంబంధించిన ఊహ మాత్రమే కాదు. మనస్సుకు సర్వసామాన్యంగా ఏర్పడే శక్తులలో ఒకటి. పరిణతిపొందిన ఆంగ్ల సాహిత్యమునుంచి అమెరికన్ సాహిత్యం వైపు, ముఖ్యంగా అర్వాచీనకాల సాహిత్యాభిముఖమైన ఈ దృష్టివేగాన్ని మనం పరిశీలిస్తే సర్వసంప్రదాయముపై మెచ్చుకోదగిన ఒక ఉత్సాహము ప్రకటిస్తున్నా రనవచ్చునేమో, కాని భావశక్తి లోపించడం చూస్తున్నాము. ఇటువంటి లోపం సాహిత్య విద్యార్థులకు చాలా అపాయకరమైనది. తమ అనుభవ పరిధికి అతీతమైన రచనలను విద్యార్థులు అవగాహన చేసుకోలేరనీ, అలా చేసుకోవటమనేది ప్రజాస్వామ్యానికి విరుద్ధమనీ సెకండరీ విద్యావిధాన సిద్ధాంతాలు చెప్తున్నాయి. ఆంగ్లసాహిత్యానికి దూరమయ్యే యీ ధోరణి ఒకవిధంగా అవధికి చేరనున్నది. బుద్ధివాదాన్ని ప్రతిఘటించే యోచనలలో ఇదొకటి (Anti-intellectualism)

పూర్వ విద్యాప్రణాళికలపైన కొన్ని దోషాలు మోపబడ్డమనటంలో సందేహం లేదు. విద్యాబోధన పద్ధతిలోను, బోధనలోను, చిట్టెలో కేవలం మిథ్యా వైశిష్ట్యం(Gentility) చాలా ఉన్నది. విభిన్న జాతులు మనదేశంలో కలవు. మనకు అభిరుచి ఉన్నంతమాత్రాన, ఒక జాతి సంస్కృతికిమాత్రం ప్రాముఖ్యం ఇవ్వడం సరికాకపోవచ్చును.

సెకండరీ స్కూళ్ళలో పరిస్థితులు కూడా మునుపటికంటె కష్టమవుతున్నవి. కాని నేను చదివిన న్యూయార్క్ హైస్కూళ్ళలో విద్యార్థులు చాలా మంది వలసవచ్చిన కుటుంబాలకు చెందినవారు. వారికి మా ఉపాధ్యాయులు Burke's Speech on Concilation, Hozlitt, Lamb, De Qunicay, Macanlay, Shakespeare నాటకాలూ, A Tale of Two Cities, ఇవన్నీ పాఠం చెప్పేవారు. అధికంగా చర్చించేవారు. కవిత్వంగురించి తెలిసిన విషయాలన్నిటికీ Mr. Walter Johnson Milton పైనాకు చెప్పిన పాఠాలే ఆధారములు. తమ అనుభవాలను సంబంధించినవి కనుకనే విద్యార్థులు పాఠాలను చదవాలని ఉండేవారు. 'ప్రపంచ సాహిత్యాలను' Humanities ని ప్రణాళికలలో చేర్చేవారు ఓ ప్రశ్న వేస్తారు. అతి సన్నిహితమైన అనుభూతిని అతిక్రమించిన ఊహాగమనమునకు ప్రణాళికలు దారితీస్తాయి కదా అంటారు. కొంతవరకు వారు చెప్పినది నిజమే. కాని నేను ఇంతకుముందే చెప్పినట్లు Humanities లో భావాలకే ప్రాధాన్యమివ్వబడింది. ఇది మంచి ప్రారంభమే కాని చారిత్రక సాంస్కృతికమైన ఊహ అభివృద్ధిచెందడానికే ఇది ప్రారంభమవుతుంది. ఇక పాఠ్యప్రణాళికల సంగతి. మన సంప్రదాయానికి సన్నిహితమయిన దనడానికి ఇది ఉపోద్ఘాతముగా ఉంటుంది. ఇక "ప్రపంచ సాహిత్యాల సంగతి—మనకు, మన సంప్రదాయానికీ, అతి సన్నిహితమైన సంస్కృతిని తోసివేయాలనే భావాన్ని సూచించడంచేత, అన్ని సంస్కృతులు సమానమైన

"ఇదేనా నీ త్ర్యక్షరీ బగళామంత్రం! ఇది నాకు ఇదివరకే తెలుసే!"

"అయితే, ఇక నేమ్? మరీ మంచిది. జపం చేసి కార్యానికి పూనుకో."

"కవిత్వం అనగానే—అదీ చిక్కేనోయ్. ఆ మధ్య రాజగోపాలాచారి-అంటే యాటంబాంబుల రాజాజీ—ఏమన్నాడో తెలుసా? ఇక్కడా అక్కడా కాదు. ఏ మారుమూల మురుగుదొడ్డిలోనో కాదు—పట్టపగలు పక్కా అసెంబ్లీలో..."

"ఏమన్నాడు త్వరగా చెప్పు-పాశ్చాత్య రాజ్యాలు చేసే అణ్వస్త్ర పాటవపరీక్ష—అంటే యాటంబాంబుల తాకత్తు చూసేపని—కవిత్వంపై కానిమ్మన్నాడా!"

"కాదు. కాదు. ఎవ్విరి అదర్ నేటివ్ మాన్ ఇన్ ఆంధ్ర ఇజ్ ఎ పొయెట్—అంటే ఆంధ్రదేశంలో అంటే ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రతి ప్రత్యామ్నాయ మానవుడూ అంటే ప్రతి రెండవవాడూ—నాకు నీవు, నీకు నేనూ అన్నమాట—కవి అన్నాడు. అలాంటప్పుడు నేను ఇంత పోటీలో ఎలా నెగ్గగలను?"

"పోటీ అనే దేముంది? ఎవరి రచన వారిది, ఎవరిముఠా వారిది, ఈ దునియాలో."

"కాని, తిరుపతి వేంకటకవులు అంతమాట అన్న తర్వాత కవి కావడానికి మనస్సు ఒప్పడం లేదోయ్."

"ఏమన్నారు ఆ కింకవీంద్ర ఘటా పంచాననులు?"

"ఎందులో జేరపండెడి హీనులెల్ల
కవులలో పల నియ్యోగి కలయుమంద్రు ;
ఎల్ల వర్ణమ్ములను గూడి యుండు కంతి
యంతిమము లేక తురకయందు గలియు.

అన్నారు ఆ శాల సరస్వతీ బిరుదాంచితులు."

"ఆ! సింగినాదం! ఇలాంటి ఎద్దేవాలెంతలే! పూర్వంవారు ఎంతకన్న పెద్దగానే—అంటే ఘాటుగానే ఎగతాళి చేశారు—శాస్త్రైర్విహీనాః కవయో భవంతి-అంటే: శాస్త్రములందు హీనులు కవులు భవంతులు- అన్నమాట. పాండిత్య హీనాః కవయో భవంతి వగైరా ఇంకా ఎన్నో ఉన్నాయి. కొండవీటిలో గాడిద నీవునుం గవివి గావుగదా అనుమానమయ్యెడిన్—అని శ్రీనాథుడన్న చాటువు నీవు వినే ఉంటావు."

"సరే! కవితకు కాలదుర్వ్యాళా నమకో. నన్ను సరిగ్గా ఏడవనిస్తారా?"

"మహారాజు లాగ ఏడవనిస్తారు. పాపం! ఆ మహాకవి 'ఏడ్వనీరు నన్ను' అని విసుక్కున్నాడు గాని. నిశ్చింతగానోయ్ ఏడుపునుంచి వదిలేవారు—అంటే వారించేవారు? నవ్వనీరు నన్ను అని అంతరాదూ నీవు ఏడవవచ్చు."

"అయితే కవితను ఎలా రువ్వాలో, గువ్వాలో నీవే చెప్పు."

"ఇది మహాకావ్యాల కాలం కాదు. వంద పేజీలు దాటితే చదివేవారు లేరు. లఘుకృతులు చాలు. ముక్తకాలతే మరీ మంచిది. ముక్తకం=చిమట బడి వడి, మంచి ముత్యంలాగ దొరికి పోయేది. అంటే ముందు వెనకా ఏదీ లేకుండా, వెనకా ముందూ తెలీకుండా లింగలింగ మహాలింగగా, అంగ రంగ భోగంగా పొంగలిముద్దలా ఉండేది...."

"మహా చిక్కొచ్చిందే నీతో. మహాకావ్యమైతే ఏదో కథ చెబుతూ పోదగా సాగదీయవచ్చు. ముక్తకాలు, భుక్తకాలు, యుక్తకాలు నాకు ఎలా?"

"శతకాలు లేవూ? అలాంటివే."

"ఆ! బాగా చెప్పావ్. నాకూ తోచలేదు. శతకమంటే జ్ఞాపకం వచ్చింది- కవిచౌడప్ప ఎంతయిదిగా చెప్పాడు- కుందవరపు కవిచౌ డౌడౌ డప్పా-అంటూ చదువుతూ ఉంటే ఎంతో ముచ్చటగా ఉంటుంది."

"మరి ఇక నేం? ఒక మకుటం సిద్ధం చేసుకో. బనాయించు పద్యాలు."

"మకుటం అంటే మాటలా? పాప్యులర్ అంటే ప్రజాదరం చూరగొనగల—అంటే జనం నాలుకపై నాని, జనం మనస్సులో మకాం చేయగల మకుటం సంపాదించడం రాజమకుటం సంపాదించగలిగినంత శ్రమ."

"అంత ప్రజలకుండెల్లో శుమాలంటావు! మరి శ్రమ పడవద్దూ? ఇంతకూ మరిచాను ఛందస్సు నిర్ణయించుకో ముందట. తర్వాత మకుటం దానిలో మలచుకొందువు గాని."

"కందం నాకు చాల ఇష్టం. అయితే అది చాల కష్టం. కందం వ్రాసినవాడే కవి, పందిని పొడిచినవాడే బంటు అనేవారు మా తాతగారు శ్రీ మధుధియు

"అంతేలే. మరి పద్యం పూర్తిగా వ్రాసుకుందామా?"

"ఓ! అశ్వమేధ మఖక అలవాటె రాజులు
ఇష్టికోరకు చేయు నపి కాదు;
పంచె పిండ్డె పైన బిందెకెత్తెడి రేగు
నిజము రామచంద్ర నీదుమాట! లేక
నమ్మ రామచంద్ర నాదుమాట."

"రెండోది వద్దులే. నిజం ముఖ్యం — దుఃఖం నిజం చెప్పారా లేదా అన్నదే మన ఆకాంక్ష కాని, ఎదుటి వాడు నమ్మితే ఏం? నమ్మకపోతే ఏం? సత్యవాక్య పరిపాలకుడైన రామచంద్రుని పేరుతో చెబుతున్నాము మరి! నమ్మక ఏమౌతాడు? కనుక, నమ్మమని మాటే మనకువద్దు. నమ్మితే నమ్ముతాడు, నమ్మకపోతే పోతాడు...అయినా ఎంతబాగుందోయ్ మనపద్యం!"

"బాగుండదూ మరి? ఎంత పరిశ్రమించాం, శ్రమించాం. కనుక నే మహాకవులను మించాం."

"నిజం నిజం."

"వస్తు ప్రధానమైన, అంటే ఇతి వృత్త ప్రధానమైన కవిత్వంలో చేయితిరిగినదే. ఇక మానవ మన సత్వాన్ని అంటే ప్రవృత్తిని చిత్రిస్తూ ఒక పద్యం వ్రాయి."

"చేయి తిరగడమే కాదు. తల తిరిగిపోయింది, లేదు కుర్రంలాగ. మానవ మనః ప్రవృత్తి అంటే— కోపమూ, తాపమూ, రాగమూ, భోగమూ, ఎలాటిది ఉంటే బాగుంటుందంటావ్?"

"అప్పటమైంది, అప్పా పప్పా చేసి పప్పన్నం తినవిది, ఉప్పళంలాగ చిక్కగా, నిప్పులాగ నిగనిగగా, ఉప్పులాగ చురుకుగా, కప్పలాగ గంతులతో ఒప్పారేది."

"అయితే ఆలోచిస్తాను, ఉండు."

"మనకు ఆలోచన వద్దు. మనసంతా ప్రియ లీలంలాగ ఉండాలి మనస్సులోని అంతరాంతరాంతరాలలో మరుగైన మాట భావంతో సహా, లేక భావం మాటతో సహా పైకి రావాలి. ఈ పాదం వ్రాసుకో... గడియలోన మబ్బు గదిలోన తబ్బిబ్బు..."

"రెండవపాదం నన్ను చెప్పనివ్వు. ప్రేయసినింపు కావలసింది నాకు కదా!—తోమ నురుగుసబ్బు దోమ గబ్బు—ఎలా ఉంది?"

"అగ్గిపుల్లా, సబ్బుబిళ్లా అన్నీ కావ్యవస్తువులే అని శ్రీశ్రీ అన్నాడనుకో. బాగానే ఉంది. కాని..."

"సందేహిస్తావెందుకు? అపూర్వంగా కేవలం సబ్బు ప్రయోగం. తోమిందది—అంటే రైకట్టి, ముప్పావు రాచినకొద్దీ, నురుగు నురుగుగా బయలుదేరుతుంది నే స్వభావోక్తిని—అంటే పొయటిక్ అబ్సర్డ్ మన్నను అన్నమాట—ఇంకేంటి. ఇక, సబ్బు పరాయి పదమని సందేహిస్తున్నావా? ఎంతమాత్రమూ, ఎన్నటికీ కాదు. పద్మాలనతాబ్దినుంచి ఈ పదం మన దేశంలో అంటే భారతవర్ష భరతఖండ ఆర్యావర్తంలో ఉంది. కబీరువంటి ప్రజాకవి—అంటే ప్రజలవెంటబడి, ప్రజలు వెంటబడిన కవి—వినియోగించాడు—అంటే వాడాడు, ప్రయోగించాడు."

"ఆ! ఆ! శ్రీశ్రీ సబ్బుబిళ్ళను కబీరు కొట్టేశాడా! మనస్సు శుభ్రంగా ఉంటే చాలు! శరీరానికి స్నానం అక్కరలేదనేవాడుకదా కబీరుడు—అభినవుడు. మరి సబ్బుబిళ్ళ ఎందుకు వాడేడు?"

"తను స్నానం చేయడానికి కాదులే. తన మనస్సును ఇతరులతో కడిగించుకోవడానికి వాడమన్నాడు."

"ఏది? ఏమన్నాడో, ఎవరిని వాడమన్నాడో చెప్పు."

"నిందక నియరే రాఖియే ఆంగన కుటీ ఛవాయ్
బిన పానీ సాబున బినా నిర్మల కరై సుభాయ్.

అంటే, నిన్ను నిందించేవారిని ఇంటిముంగిట్లో పాక వేసి కాపురం పెట్టించు. సబ్బు నీరూ అవసరం లేకనే నీ మనస్సును కడిగి వేస్తారు—అన్నాడు."

"కబీరు సాబున్—అంటే సబ్బు హిందూవీక్లీ పరిషోపులా హాయిగా ఉందనుకో. ఇదిగో ముగుస్తు వాడిపది—ఎంత పావనా, వచ్చేపువ్వా మనమే. మరోక పాదం ఆలోచిద్దాం.

"సబ్బు ఇన్ఫెక్షన్—అంటే రోగాలు అంటే జనపదోధ్వంసక వ్యాధులు—తెచ్చేది కాదోయ్. ఘరనా లేదు. ఇంతకూ వాడు వాడేందికూడా కాదు. అది అక్కరలేదు అన్నాడు పాపం."

"వద్దులే. కబీరువంటి గోసాయివాడిని—వాడిక పోయినా మనకు వద్దులే. వాడి చిట్కా మాత్రం కొట్టేద్దాం"

"అయితే నియుప్తం. ఈపాదం చూడు—అంతలోనే మబ్బు అవలగబ్బు!"

"వాహ్వా! వాహ్వా! ఎంతలో అందుకున్నావోయ్. గురువునుమించె శిష్యుడయ్యేట్టున్నావే.

# కలగూరగంప

## పంటసిరి పండుగ - సంక్రాంతి

ఆశయాలూ, ఆదర్శాలూ మారినా, అభ్యాసాలూ, ఆచారాలూ శతాబ్దాలపాటు అంటిపెట్టుకొనే ఉంటాయి మనల్ని. ఆశయాల ఆంతర్యం మెచ్చి, ఆదర్శాలు ఉన్నతిని అందుకొంటున్న కొద్దీ ఆ అభ్యాసాలూ, ఆచారాలూ సంకేతాలుగా, సుందర ప్రతీకాలుగా నిలిచిపోతాయి సంఘంలో. అలాటివే మన పండుగలూ, పర్వాలూనూ.

మన తెలుగువారి పెద్ద పండుగలలాగే సంక్రాంతి పండుగ—పొంగలి పండుగ—కూడ మనపూర్వుల పంటల పండుగే. ఇది మనకు అంతా ఇంతా పండుగ గాదు. పెద్ద పండుగ. మనకే కాదు, దేశానికంతా పెద్దపండుగ. పరిశ్రమజీవులయిన మన పూర్వులు తాము పండించుకొన్న పంటలను-ధాన్యాలు, కూరలు, కాయలు, పండ్లు, మున్నగువాటిని-వి ఆ యోతాన్హ హంతో పొంగించి, వండుకొని, పంచభూతాలను తిని యించి తామూ తినిసి, భోగి మంటల వెలుగులో, గొబ్బితో-గొండ్లితో పొంగి, మైమరచిన పండుగ ఇది. కనుకనే శ్రీనాథుడు దీనిని 'పెనుబండువు' అన్నాడు.

ఈ పెనుబండువుకు కారణం ప్రకృతిమాత చల్లనిచూపే. ద్వాదశాత్ముడైన-ద్వాదశరాశి స్వరూపి అయిన-దివాకరుని దివ్యయాత్రలో ఘట్టాలు నాలుగు. అవి: మేష, కటక, తులా, మకరసంక్రమణాలు. మార్తాండుడు ఈ మజిలీలు చేరగానే ప్రకృతిపులకించి వివిధాల విలాసాలు చూపుతుంది. ఆ విలాసాల విశిష్ట రూపమే సంక్రాంతి. తొలకరిలో మొలకెత్తిన పెసల-జొన్న, సజ్జ, అరిక, సామ, కొర్ర, నూవు, పెసర, కంది, సెనగ మొదలయిన మెట్టపైర్లు; రాగి, వరి, కూరగాయలు మొదలయిన మాగాణిపైర్లు— కాపు వచ్చి, పండి, కార్తీక మార్గశిరాలకు ఎటుచూచినా కలకలలాడుతూ కనులపండువుగా ఉంటాయి. బంగారు పండి, ఒరిగి కోతకుసిద్ధంగావున్న వరిచేలు, చేమంతి, బంతిపూలు బంగారుకాంతులు వెదజల్లుతుండగా పొంగని మానవుడూ ఉంటాడా? సంవత్సరారంభం నుంచి తాముచేసిన కృషి, పరిశ్రమ ఫలించే శుభదినాలను చూచి కర్షకులు మురిసిపోయే సమయమది. ఈ సస్యసమృద్ధిని చూచే కాబోలు కృష్ణభగవానుడు 'మాసానాం మార్గశీర్షోహమ్' అన్నాడు!

ఈ మార్గశిరం సమాప్తిమంచే ఉత్తరాయణం ప్రారంభమౌతుంది. భాస్కరుని యాత్రలోని రెండవ ఘట్టం కటక సంక్రమణం నుంచి నాలుగో ఘట్టమైన మకరం వరకు దక్షిణాయనమని, మకరం నుంచి కటకం వరకు ప్రయాణాన్ని ఉత్తరాయణమనీ జ్యోతిశ్శాస్త్రజ్ఞులంటారు. కర్కాటకంనుంచి మకర సంక్రాంతి వరకు ప్రభాకరుడు కొంచెం దక్షిణాభిముఖంగా సంచరించడంవల్ల ఈ ఆరునెలలకు దక్షిణాయనమని, మకర మాసంనుంచి కటక మాసంవరకు ఉత్తరాభిముఖంగా సంచరించడంవల్ల ఉత్తరాయణమని సంకేతాలు ఏర్పడ్డాయి. దక్షిణాయనం పితృదేవతలకు ముఖ్యమట. కనుక చెడ్డకాలం. నిజమే: వానలు, వరదలు, బురద చీకట్లు, మబ్బులు—మరి చెడ్డకాలం కాదూ! ఉత్తరాయణం దేవతలకు ముఖ్యమట. కనుక ఉత్తమకాలం. ఇదీ వాస్తవమే. చేలు చొక్కలయ్యేట్టుగా పంటలు, గాదెలునిండా, గరిసెలనిండా ధాన్యం, ఆరోగ్యం, ఐశ్వర్యం,—మరి ఉత్తమకాలం కాదూ! దక్షిణాయనంలో మరణిస్తే ఉత్తమగతులుండవనీ, ఉత్తరాయణంలో మరణిస్తే మోక్షప్రాప్తి అనీకూడా మనపూర్వుల విశ్వాసం. కనుకనే భీష్ముడు రణరంగంలో దక్షిణాయనంలో కూలినా ఉత్తరాయణం వరకూ ప్రాణాలు బిగబట్టుకొని తిర్యాతి పారి అనుకున్నాడని భారతగాథ. భీష్ముడు స్వచ్ఛంద మరణానికి వరం పొందినవాడు గనుక

యోగ్యమైన గొర్రె తలకాయకో, మరొక జంతువు శిరస్సుకో సంకేతం.

"ముందున్నది ముసళ్ళపండుగ" అనే సామెత ఉంది మనకు. పాతకాలపు పశుబలిని సూచించే సామెత ఇది. నిజానికిది 'ముసళ్ళ' పండుగ కాదు. ముసర — ముసర్ల పండుగ. ముసర అంటే అన్నపు మెతుకులు. ఇది నేడు మనభాషలో లుప్తమైనా, కన్నడంలో, వ్యవహారంలో ఉంది; అన్నపు మెతుకులు, అన్నపు అంటు అనే అర్థాలలో. ఈ సామెత కొక చిన్నకథ ఉంది. ఒక గొర్రెపిల్ల చాల ఉత్సాహంతో గంతులు వేస్తూ ఉంది. పాపం! దానికేమి తెలుసు దానిజీవితం ఎప్పుడు ఇతరుల ప్రీత్యర్థమౌతుందో నని! అక్కడే మేస్తున్న ఒక ఎద్దు చూచి అన్నదిట — "ముందుందిలే ముసర్లపండుగ" అని. "అన్నం పొలాల్లో బలి — పొలి — చల్లే సంక్రాంతి పండుగ వస్తుంది. అప్పుడు తెలుస్తుం దిలే నీ మిడిసిపాటు!" అని అర్థం. సంక్రాంతి తర్వాత, కనుము పండుగనాడే కదా ఎక్కడెక్కడ లేని వైభవం! గొర్రెల కేమో బలి అయ్యేపాటు. కనుక, ఈ సామెత మనం ఒకానొకప్పుడు పంటనేలకి బలి ఇచ్చే ఆచారాన్ని సూచిస్తుంది. దానిరక్తంలో రంజితం చేయడానికి మారే నేడు అన్నాన్ని కుంకుమతో కలిపి - ఎర్రన్నం చేసి - పొలి చల్లడం; మేక శిరఃఖండనానికి మారే, గుమ్మడికాయను పగులగొట్టడం.

ఈ సందర్భంలో గ్రామ దేవతల జాతరలో జరిగే బలిపద్ధతి చూస్తే నేడు నాగరికులైన మనం కూడా అలాటి బలులు జరుపుతూ ఎలా ఉండేవారమో ఊహించుకోవచ్చు. గ్రామాలలో మొగలాయి, మహారాష్ట్ర పరిపాలన కాలంలో "బారాబలూతి" అనే పద్ధతి ఉండేది. ఈ పద్ధతిలో రెండు తెగలు — ఒకటి వ్యవసాయ ప్రధానమైన పని చేయించే తెగ. రెండవది పని నిర్వర్తించే తెగ. మొదటి దానిపేరు కాపుసంఘం. రెండవదాన్ని సెటిసంఘం, అంటారు. మొదటిదానికి పెద పెద్ద కాపు. రెండవ దానికి పెద్ద పెద్ద సెట్టి. రెండవదానిలో రెడ్డి (గ్రామ మునసబు), కరణం, పంచాంగమయ్య, వడ్రంగి, కమ్మరి, కుమ్మరి, మంగలి, చాకలి, కంసాలి, ఆసాది, మాదిగ, తలారి — అని పన్నెండు తెగలవారు వస్తారు. వీరంద రినీ ఆయగాండ్రు అని అంటారు. గ్రామంలో ఏ పని జరిగినా, పెద్దకాపు చెప్పడం, తక్కినవారు చేయడం- ఇది సంప్రదాయం. గ్రామదేవత జాతరకు గ్రామ మునసబు డబ్బు ఇస్తాడు. కరణం లెక్కపక్కా చేసి ఏర్పాటుచేస్తాడు. పంచాంగమయ్య ముహూర్తం పెడతాడు. వడ్రంగి కర్రతో దేవి విగ్రహం చేస్తాడు. కుమ్మరి అవసరమైన మృణ్మయ పాత్రలు చేసిఇస్తాడు. కమ్మరి దేవిని ఊరేగింపు చేసే రథానికి అవసరమైన ఇనుప సామగ్రి చేసి ఇస్తాడు. కంసాలి నగలు ఇస్తాడు. మంగలి నాగస్వరం వాయిస్తాడు. చాకలి వసెలు అంద జేస్తాడు. ఆసాది పాటలుపాడి బలిని నిర్వహిస్తాడు. మాదిగ బలి జంతువు తలను కత్తితో నరుకుతాడు. తలారి కాపలా కాస్తాడు. బలిచేయబడిన జంతువులలో ఈ పన్నెండు మంది ఆయగాళ్ళకి వాటాలుంటాయి. ఈ పద్ధతి నేడు లుప్తప్రాయమైం దనుకోండి. ఈ ఆయగాళ్ళను కృష్ణరాయలు ఆయతికాడు- అన్నాడు.

"ఆయతికాని కీకు మను
రాలయు ముఖ్యము లాతి దిచ్చి త్రి
స్థాయుతుఁడై. ఆముక్త — 4.218."

కొన్ని ప్రాంతాలలో స్త్రీలు కనుమనాడు పుట్టింటి తోబుట్టువులకోరి ఒక వ్రతంచేస్తారు. ఎరుపు, పసుపు, తెలుపు (పెరుగు) అన్నాలు కలుపుకొని పిడచలు పిడచలుగా చేసి, పూజాపురస్కారాలు ఆదరించి, కాకులకు వెదజల్లుతారు. దీనిని 'కాకిపిడచలుపెట్టడం' అంటారు. వనితలు గొబ్బెమ్మను జలాశయాలలో ఓల లాడించడం అందరూ ఎరిగినదే. ఈ పంట కోత పండుగ సంతోష పరవశతలోనే పడచాలి బొమ్మల కొలువులూ, ఆటలూ పాటలూ, అల్లర్లు అలకలూనూ.

ఇక పశువుల సంబరాలు చెప్పనక్కరలేదు. గంగి రెద్దుల హంగులు వీటిలో అంగాలే. మన జీవికకు మూల బంధమైన ధరిత్రీ మాతను అర్చించడంలో — కృషి చేయడంలో — మనతోపాటు కొట్టే కోరాడే కోడెలను, తియ్యని పాలతో తనియించే ఆవులనూ అభినందించడం, పరుగు పోటీలు పెట్టడం — ఇవన్నీ మన కృతజ్ఞతా సూచక చర్యలే. తన సాధన సంపత్తిని గౌరవించడంలోనే ఉంది మానవుని రహస్యమంతా; ఇవీ పదీ తెలియనివాటి — ఆహారపు వింగడింపులేని నాటి — పొంగలిని పొంగించుకోవడంలోనే ఉంది అభిరుచి అంతా.

ఇలాటి పొంగలితని గూర్చి ఆస్వాదించిన జనం "రంగడే దైవం, పొంగలే ప్రసాదం." అనే సామెతని

ముగించి 1850 లో స్విట్జర్ లాండ్ లోని బాసెల్ నగరంలో ఉన్నత విద్యాభ్యాసానికి వెళ్ళాడు. అక్కడ మూడు సంవత్సరాలపాటు చదువు సాగించి, ఓడ ఎక్కి సరాసరి మంగుళూరికి వచ్చి స్థిరపడ్డాడు. అప్పుడు ఆయన వయస్సు 22 సంవత్సరాలు. మంగుళూరికి వచ్చిన తరువాత కన్నడభాష నేర్వడం ప్రారంభించాడు. 1871కి ఆయన కన్నడభాషలో సంపూర్ణ పాండిత్యం సంపాదించాడు. ఆయన ఎవరివద్ద కన్నడం నేర్చుకొన్నాడన్న వివరాలేవీ తెలియవు. 1871 లో ఆయన దక్షిణ కన్నడజిల్లా మడికేరిలో నివసించేవాడు. మంగుళూరు వదలి ఎప్పుడు మడికేరికి వచ్చిందీకూడా తెలియదు. ఆయన పరిష్కరించి ప్రకటించిన "శబ్దమణి దర్పణం" పీఠిక 1871 లో మడికేరిలో వ్రాసింది. 1874 లో ఆయన నాగవర్మ రచితమైన 'ఛందోంబుధి"ని పరిష్కరించి ముద్రించాడు. దానికి విపుల పీఠికను కన్నడ సాహిత్యచరిత్రనుగురించి ఒక వ్యాసాన్ని వ్రాశాడు. అప్పుడప్పుడు ఇండియన్ ఆంటిక్వెరీ పత్రికకు వ్యాసాలు వ్రాసేవాడు. 1892 లో ఆయన భారతదేశం వదలి మాతృభూమి అయిన జర్మనీకి వెళ్ళి వుర్టెంబర్గ్ జిల్లాలోని టుబింజన్ అనే గ్రామంలో స్థిరపడ్డాడు. ఆయన తన దీర్ఘకాల వ్యాసంగంలో సంపాదించిన కన్నడ భాషా సాహిత్య సామగ్రినంతా పరిష్కరించి 1893-94 లో తన జీవిత సారసర్వస్వమైన "కన్నడ-ఇంగ్లీష్ డిక్షనరీ"ని ప్రకటించాడు. ఈ మహోత్కృష్ట నిర్మాణానికి మెచ్చి టుబింజన్ విశ్వవిద్యాలయం ఆయనను 1896 లో 'డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ' అనే బిరుదంతో గౌరవించింది. కిట్టెల్ కన్నడదేశంనుంచి తీసుకొని వెళ్లిన తాళపత్ర గ్రంథాలను, ఆయన వ్రాసిన టిప్పణీ వ్యాఖ్యలను ఇప్పటికీ టుబింజన్ విశ్వవిద్యాలయం భద్రపరచి రక్షిస్తున్నది. తర్వాత ఆయన 1903 లో—తన 72 వ ఏట అకస్మాత్తుగా కన్నుమూశాడు. తన కన్నడ వ్యాకరణం ముద్రితప్రతిని చేతితో తాకి, కండ్లారా చూచే భాగ్యం తనకు లభ్యమైందని ఆయన తను మరణించే నాటికి మంగళూరులోని బాసెల్ కమిటీకి ఒక జాబు వ్రాశాడు. ఈ వ్యాకరణం కిట్టెల్ రచించిన కట్టకడపటి ఉద్గ్రంథం. ఈ విధంగా ఆయన తన జీవితం తుది గడియ వరకూ కన్నడభాషకు సేవచేసి, కన్నడ విద్వత్తుకు భద్రమైన పునాది వేశాడు.

ఆయన పరిష్కరించిన "శబ్దమణిదర్పణం" 1872 లో ప్రకటితమైంది. ఈ గ్రంథం పాఠ పరిశోధన కోసం ఆయన తొమ్మిది వ్రాతప్రతులను పరిశీలించాడు. ఇలా వ్రాతప్రతులను సేకరించడమే మహా కార్యం, తర్వాత వాటి పాఠభేదాలను గమనించి ఏది గ్రాహ్యమని నిర్ణయించడము మరొక మహాయజ్ఞం. ఎలాటి సహాయసంపత్తీ లేని ఆ కాలంలో ఆయన తన గంతవ్యమార్గాన్ని తానే నిర్ణయించుకొని, తప్పులుచేస్తూ, దిద్దుకుంటూ శాస్త్రీయ దృక్పథంతో ముందుకుసాగి కన్నడంలో శ్రేష్ఠ వ్యాకరణమైన "శబ్దమణిదర్పణం" ప్రకృతి పాఠ మొకదానిని నిర్ణయించి ముద్రించాడు. అటుతర్వాత ఈ వ్యాకరణం రెండుమూడు సార్లు ముద్రితమైంది. ఆ ముద్రణలకు కిట్టెల్ పాఠ పరిష్కరణ చాలా ఉపయోగించింది. ఆయన పాఠ పరిష్కరణ నిర్దుష్టమైనదని కాని, సర్వకాలాలకూ ప్రమాణభూతమని కాని చెప్పడానికి అవకాశం లేకపోయినప్పటికీ, ఇంతవరకూ ఆయన ముద్రించిన పాఠాల శబ్దమణిదర్పణాన్నే కన్నడం నేర్చుకొనేవారంతా చదువుతున్నారు. ఆయన చేసి, ఆపిన పనిని అంతటి సమగ్రతతో కొనసాగించి మేలిమి చేయవలసిన పని ఇంకా ముందు జరగవలసి ఉంది. కన్నడ భాషాభ్యాసులకు అత్యావశ్యకమైన ఈ వ్యాకరణాన్ని ఆయన కన్నడ ప్రజలకు కానుక యిచ్చి పోయాడు.

ఆయన పరిష్కరించి ముద్రించిన మరొక గ్రంథం నాగవర్మ రచించిన కన్నడ ఛందో గ్రంథం 'ఛందోంబుధి.' ఇది శబ్దమణిదర్పణం కన్నా ప్రాచీనమైన గ్రంథం. ఈ గ్రంథం లిఖితప్రతులు లభించడమే అపురూపం. దొరికిన వాటిలోను గ్రంథపాతాలు, అర్వాచీనులు చొర్రిన ప్రక్షిప్తాలు అనేకం. వీటిని విమర్శించి గ్రాహ్యమైన పాఠక్రమం కనిపెట్టడం దీర్ఘ పరిశ్రమ సాధ్యం. కిటెల్ ఈ గ్రంథం పద్నాలుగు వ్రాతప్రతులను పరిశీలించాడు; వివిధ పాఠాంతరాలను గుర్తువేసుకున్నాడు; తనకు ఏది సమర్పకమని తోచిందో

దానిని గ్రహించి ముద్రించారు. దీని పీఠికలో ఆయన గ్రంథకర్తను గురించి తనకు తెలిసినంత మట్టుకు వ్రాసి గ్రంథపరిష్కరణ కార్యం ఎంతచిక్కైందో వివరించారు. అన్నిటికంటె ఉపయోగకరమైంది ఆయన పీఠిక తర్వాత వ్రాసిన కన్నడ సాహిత్య చరిత్ర. తను సేకరించిన, తను చూచిన తాళపత్ర గ్రంథాల ఆధారంతో ఈ సాహిత్యచరిత్రను వ్రాశారు. ఆ కాలానికి ఇదొక ఘన కార్యమనే అనాలి. కన్నడసాహిత్యాన్ని తమిళ సాహిత్యంతో పోలిస్తూ, ఆయన వ్రాసిన "But my own impression is that the more Canarese Vernacular literature is known, the more evident it becoms that it will fully bear comparisom with any other Vernacular literature of the South" అన్న వాక్యాలు ఆయనకు కన్నడంపై ఉన్న అభిమానాన్ని స్పష్టపరుస్తాయి.

కిటెల్ కీర్తిని చిరస్థాయి చేసినది "కన్నడ-ఇంగ్లీషు నిఘంటు" అనే బృహత్కోశం. ఈ మహాకోశం నిర్మాణానికి సుమారు పదిహేను సంవత్సరాలు పట్టింది. అంతకుముందు రీవ్స్ అనే అతను కన్నడ-ఇంగ్లీషు నిఘంటువొకటి సిద్ధపరిచాడు. ఆయన 1817 లోనే ఉపక్రమించి, 1832 లో అంటే 15 సంవత్సరాల తర్వాత ముగించి ప్రచురించారు. ఈ నిఘంటువు తన నిఘంటువుకు ఎంత తోడ్పడిందీ కిటెల్ ముక్తకంఠంతో తెలిపారు. కాని ఆ నిఘంటువు ప్రామాణికం కాదు. చేతికి చిక్కిన పదాలన్నీ దానిలో దూరాయి. ఈ విషయాలన్నిటినీ కిటెల్ పరిశీలించి, గ్రాహ్యమైన అంశాలను మాత్రమే స్వీకరించారు. ఆయన సుపక్వ కన్నడ పాండిత్యానికి ఆ నిఘంటువు ప్రత్యక్షం. నేటికీ దానిని మీరటం కర్నాటకులకు సాధ్యం కాలేదు. ఇది 1894 లో ప్రచురితమైనా, నేటికీ కన్నడానికి నిష్కృష్టమైన, ప్రామాణికమైన మహాశబ్దకోశమే. ఇలాంటి నియమబద్ధమూ, శాస్త్రీయమూ అయిన నిఘంటువు భారతఖండంలో ఏ భాషకూ లేదని పండితులంటారు. ఈ నిఘంటువును ప్రశంసిస్తూ ఫ్లీట్ అనే మహావిద్వాంసుడు "His greatest scientific achievement అనీ" "will remain a monumentum oer pernnium of a noble devoted to incessant earnest labour" అని ప్రశంసించాడు.

కిటెల్ అంతిమ కృతి ఇంగ్లీషులో వ్రాసిన కన్నడ వ్యాకరణం. హళగన్నడం (పాతకన్నడం), నడుగన్నడం (మధ్యకన్నడం), హొసగన్నడం (కొత్తకన్నడం) అనే కన్నడ భాష అవస్థాత్రయం వివరణ దీనిలో ఉంది. ఈ వ్యాకరణం ప్రామాణికమయినది. ఈ గ్రంథానికి ఆయన 1903 ఫిబ్రవరిలో పీఠిక వ్రాశారు. ఆ సంవత్సరం డిసెంబర్ నెలలో కాలధర్మం చెందారు. ఈ గ్రంథం కిటెల్ యోగ్యతను, వ్యక్తిత్వాన్ని, పాండిత్యాన్ని ఇది వాస్తవంగా ప్రతిబింబింపజేస్తుంది. ఇది నేటికీ ప్రమాణికమైన వ్యాకరణం.

కిటెల్ కన్నడ భాషకు చేసిన మహాసేవ ఈ గ్రంథాలలో మూర్తీభవించి ఉన్నది. ఇంతే కాక ఆయన పెక్కు పరిశోధన వ్యాసాలు వ్రాశారు. 1872-1899 మధ్య ఆయన ఇండియన్ యాంటిక్వెరి పత్రికలో 19 వ్యాసాలు వ్రాశారు. వాటిని చదివితే కిటెల్ ఎలాంటి సమస్యలను తీసుకునేవారో, ఎలా పరిష్కరించేవారో, ఆయన పరిష్కార మార్గం ఎలాంటిది అనే విషయాలు మనకు స్పష్టమవుతాయి. వాటిలో ఒక వ్యాసం ద్రావిడ సంఖ్యావాచకాలకు సంబంధించింది. మరొకటి కన్నడ వైష్ణవ దాససాహిత్య పరిచయానికి సంబంధించింది. మరొకటి సంస్కృత భాషలో ప్రవేశించిన ద్రావిడపదాల వివేచనం. కర్నాటక సంగీతం గురించి నిజగుణ శివయోగి తెలిపిన అభిప్రాయాన్ని ఆయన మరొక వ్యాసంలో వివరించారు. కన్నడంపై జర్మన్ భాషలోనూ ఆయన వ్యాసాలు వ్రాశారేమో! 'పరమాత్మ జ్ఞాన' అనే ఒక గ్రంథాన్ని ఆయన కన్నడ భాషలో వ్రాసినట్టు ప్రతీతి.

కన్నడానికి ఇంతటి మహాసేవ చేసిన మహనీయుడు ఫర్డినెండ్ కిటెల్. శాస్త్రీయ మార్గంలో కన్నడ విద్వత్తు అభివృద్ధి కావడానికి ఆయన కృషి చేశారు. ఈ కృషి ఫలితంగా నేడు కన్నడ నాడులో సాహిత్యాన్ని పెక్కు దృక్పథాలనుంచి విమర్శించే విద్వాంసుల పరంపర ఏర్పడింది. కిటెల్ కాలంకన్నా నేడు విజ్ఞానం విస్తరించింది. ఈ స్థితికి కారణ భూతులలో అగ్రగణ్యుడు కిటెల్; కన్నడ ఋషులలో ఆయన ఒకడు.

('ప్రబుద్ధ కర్ణాటక' పత్రిక విళంబి ఆశ్వయుజ సంచికలోని శ్రీ డి. ఎల్. ఎన్. గారి వ్యాసం నుంచి.)

తగినవను పడుతాయి. లైనో టైపు కన్నా ఇదిచాలా ప్రయోజనకరం, లాభకరమూను. "నెగెటివ్ పేపరును" భద్రపరచుకుంటే, నెగెటివ్ నుంచి ఫోటోలు తీసి ఎప్పుడు ఎన్ని సంవత్సరాల కైనా మరల కాపీలు తీసుకోవచ్చు.

అయితే ఇది బహువ్యయసాధ్యం. మోనో టైపు యంత్రం ఒక్క దానికే కనీసం 80 వేల రూపాయల ఖరీదు. దీనిని ఎందరు పుస్తక ప్రచురణ కర్తలు కొన గలుగుతారు? పెట్టుబడి పెట్టగలుగుతారు? కనుక చేతితో కూర్చుటే అభివృద్ధి చేయాలి. ఏ సంస్కరణ మైనా ప్రజాహిత దృష్టితోను, బాగుపు దృష్టితోను జరగాలి. దీనికి ముద్రాక్షరం తీరు నిపుణులు శ్రీ ముద్దాలి రాఘవరామచంద్రరావుగారొక పథకం సిద్ధపరచారు. ఇప్పటి వ్రాతరూపం, అచ్చురూపం చెడకుండా చేయడానికి ఇకారసహిత వర్ణం ప్రాతిపదికగా గ్రహించారు. ఉదాహరణకు కి. దీనిపక్క సైన ఈకారాద్యచ్చులంటేను, పక్కన తలకట్టు, గుడింతాలు ఇవ్వవచ్చు. అచ్చులోని 700 గళ్ళను 170 కి తగ్గించవచ్చు. ఈ డిస్కులపెట్టుబడి వేయిరూపాయలున్నా త్రిమే. ఏ సామాన్యుడు పెట్టుబడిదారైనా జంకని వస్తువు. కేసులకేసుతో సహా అన్ని అక్షరాలూ వుంటాయి. ఇంతవరకు ముద్రితమైన గ్రంథాలను మార్చనక్కరలేదు.

ఇక టైప్ రైటర్. ఇంగ్లీషు అక్షరాలను సరిగా పరిశీలిస్తే మూడు భాగాలున్నట్టు కనిపిస్తుంది. ఆ విధంగానే తెలుగు అక్షరాలను తలకట్టు—మధ్యభాగం—

ఒత్తులు అని విభజించవచ్చు. తలకట్టు గల అక్షరాలు— అకారాంతాలైనవి—మనకు ఎక్కువ. తలకట్టువల్ల వేగం తగ్గుతుందనేది కేవలం అపోహ. శ్రీరామచంద్ర రావుగారు ఈ సూత్రం ప్రకారం ఒక టైపురైటరు సిద్ధపరిచారు. దీనిలో కీలు 44. ప్రతి అక్షరాన్నీ రెండు తడవలతో కొట్టవచ్చు—ద్విత్వంగల అక్షరం వంటివి ఒకటి రెండు మినహాగా. ఈ టైపురైటరులో సంఖ్యలు, విరామచిహ్నాలు సహా 90 అక్షరాలు. 'డెడ్ కీ'లవల్ల ఎలాటి ఆటంకమూ లేదు. ఫ్రెంచి, జర్మన్ భాషల టైపురైటర్లలోను కొన్ని 'డెడ్ కీలు' ఉన్నాయి; వేగం తగ్గలేదు.

వ్యాకరణశాస్త్రజ్ఞుల వాదం మరొకటి ఉంది: ఇప్పుడు మనం వ్రాసే లిపి వ్యాకరణానుగుణం కాదు. ద్విత్వాక్షరాలు వ్రాయవలసి వచ్చినప్పుడు పూర్వాక్షరం అరాక్షరమే వ్రాసి, పరాక్షరం పూర్తిగా అచ్చుతో కూడా వ్రాయవలసి ఉండగా, మనం పూర్వాక్షరాన్ని పూర్తిగా వ్రాసి,పరాక్షరాన్ని అరాక్షరంగా కింద వ్రాస్తున్నాము. అలవాటువల్ల సరిగా కనబడుతున్నప్పటికీ, శాస్త్రదృష్టితో చూస్తే ఇది అసాధువు. కనుక ఒత్తుల పద్ధతి మానివేసి మొదటిఅక్షరం పొల్లుగా వ్రాసి తర్వాతిది పూర్తిగా వ్రాసే పద్ధతిని అలవాటుచేయాలి. ఈ పద్ధతి కన్నడంలో ఇదివరకే అమలులో ఉంది. సత్యం అని వ్రాయవలసిన చోట 'సత్ యం' అని వ్రాస్తారు—అంటారు. కాని, ఈ వాదం శాస్త్రీయమే కాని, ఈ విధానంవల్ల శతాబ్దాలుగా అలవాటయిన పద్ధతి ఇది. దీనిని మార్చడం కష్టమే కాక, స్థలం పొడుగుగా కలిసిరాదు. కింద పెట్టడానికి బదులు పక్కన పెరుగుతుంది తాటాకు పుస్తకాలు లాగ. ఇప్పుడు చేతితో పట్టుకుని చదవడానికి అనుకూలమైన సైజులు కొన్ని అలవాటయాయి. మరల తాటాకుల సైజు ఎందుకు?

ఇంత బాధ ఎందుకు? ప్రపంచంలో హెచ్చుగా రోమన్ లిపే వ్యాప్తిలో ఉంది. సోవియట్ రష్యా అజర్ బైజానీ వంటి లిపి లేని భాషలకు రోమన్ లిపి అవసరమైన తన లిపినే అలవాటుచేసింది. చైనా కూడా తన చిత్రలిపిని మాని రోమన్ లిపినే అనుసరించదలిచింది. మనం కూడా ఎందుకు అనుసరించకూడదు?— అనే వాదం ఉంది. రోమన్ లిపివల్ల మనకు కంపోజింగు గళ్ళు తగ్గినా, అచ్చుస్థలంలో పొడుగు ఉంటుంది. కిందికి పంక్తులు పెరగడానికి మారు పక్కన పెరుగుతాయి. దీనిని నేర్చడానికి ఒక తరం కూడా చాలదు. అందుకని లైనో టైపు, మోనో టైపు, అత్యాధునికమైన 'ఫోటో సెట్టర్' ముద్రాపద్ధతి ఉన్న దేవనాగరి లిపే నయం.

సంఖ్యలకొక చిన్న సమస్య. నేడు మన తెలుగు సంఖ్యలు పంచాంగాలలో మినహా ఎక్కడా వాడడం లేదు. తెలంగాణాలో మాత్రం అలవాటు ఉండవచ్చు. కాని, విజ్ఞానశాస్త్రం పెరిగిన తర్వాత కాలంలో రోమన్ అంకెలే వాడడం సహేతుకమేమో!

నేడు నేల నాలుగు చెరగులా ఏకమవుతున్నాయి. ప్రపంచానికంతా ఏక లిపి అవసరమని ఉద్యమం తలయెత్తుతుండగా, చిన్న మార్పులకే అంగీకరించని సంకుచిత దృక్పథమా?— అని వసుధైక కుటుంబవాదులు ఆక్షేపిస్తారు. ఇంట గెలిచి రచ్చ గెలవమన్నారు కదా పెద్దలు. అయినా ఇలాటి ఒక మోనో టైప్ పద్ధతిని కూడా శ్రీరామచంద్ర రావుగారు సిద్ధంచేశారు. దీనిలో 40 కీలు ఉంటాయి. ద్వివిధంబటే ఏడెనిమిది చిహ్నాలలో 'మ్యాట్రిక్స్' మార్చితే మన దేశంలో ప్రభుత్వం అంగీకరించిన 14 భాషల లిపులూ పోత పోసుకోవచ్చు.

ఏమైనా, ఆంధ్రప్రభుత్వం నియమించిన లిపి సంస్కరణ సంఘం శ్రీరామచంద్రరావుగారి పరికరాలు మూడు పరిశీలించడం అవసరం. ప్రజల ఆమోదం లేని ఏ సంస్కరణా ఫలించదు. కనుక నేటి సంస్కరణ, మార్పు ప్రజలు విడిగిపోకుండా ఉండాలని మనవి చేస్తున్నాం.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad